Photo by S. L. Karwade



బహుమతి
పొందిన వ్యాఖ్య

ధన మిచ్చి ధ్యానిస్తె దయ కలుగుతుందా!

పంపినవారు:
కె. హేమాద్రి - గొల్లప్రోలు



ఎటువంటి
కార్యావసరాలకైనా
ఆదర్శప్రాయమైన
బహుమతి







ఇచ్చేవానికీ పుచ్చుకొనేవానికీకూడ గౌరవాన్ని చేకూర్చే బహూమానం. పిన్నలకూ పెద్దలకూ ఒకే మోస్తరు వినోదాన్ని కూర్చే విద్యాకేంద్రం. **డిలక్స్ వ్యూ-మాస్టరు** మరింత కాంతివంతమైన బొమ్మను చూపటానికి తగిన ఏర్పాటు కలిగివున్నది. తొమ్మిది ఆకర్షణీయమైన రీల్సుతో సహా (మూడు ప్యాకెట్లలో), ఒక అందమైన బహూమానపు పెట్టె, ఖరీదు లేకనే ఇవ్వబడును.

ప్రాతినిధ్యములు లేని చోటులందు
డీలర్సు కావలెను

రు.
49/12

లోకల్ టాక్సు
అదనము

# VIEW-MASTER®

కుటుంబమునకు వినోదము



పూర్తి వివరములకు :

**పటేల్ ఇండియా (ప్రైవేట్) లిమిటెడ్**
190, హార్నబీ రోడ్డు :: బొంబాయి - 1.
బ్రాంచీలు : న్యూ ఢిల్లీ, కలకత్తా, మద్రాసు.

SHILPI P. I. 403 A

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

పుస్తకరూపమున వెలువడినది

# "ఆనందనిలయమ్"

(హాస్యనాటిక)

రచన: గోరాశాస్త్రి

ఆలిండియా రేడియోలో ప్రసారితమై వేలాది శ్రోతల నానందపరచిన హాస్యనాటిక - నేటి మధ్య తరగతి జీవితాల కన్నీళ్ళకూ, నవ్వులకూ ప్రతిబింబం! సున్నితమైన హాస్య రూపంలో జీవితవిషాదాన్ని చిత్రించే నాటకం.

ప్రతులకు త్వరపడండి:

## సాగర్ పబ్లికేషన్స్

11, బ్రాడ్వే :: మదరాసు-1.




కె. టి. డోంగ్రే & కంపెనీ,

(ప్రైవేట్) లిమిటెడ్,

బొంబాయి - 4

GP

ఆరేళ్లే కానీ, పదహారేళ్ల వయస్సే కానీ శిరోజములకు రక్షణ అవసరం. చిన్నారి శిరోజములకు చిరకాల ప్రఖ్యాతమైన అభిమాన తలనూనె కేశవర్ధిని ఇప్పుడే ప్రారంభించి, వారి కురుల అందమునకు దోహద మివ్వండి! తల నిండిన చక్కని కురులతో వారి జీవితం ప్రారంభించండి. ఆరోగ్యవంతమైన శిరోజములకు వాడవలసినది

## కేశవర్ధిని










కేశవర్ధిని షాంపూతో మీ శిరోజములను చిక్కగా పరిమళయుతం చేసుకోండి!

కేశవర్ధిని 14 అ.

షాంపూ 14 అ.

తపాలుచార్జి ప్రత్యేకము

అన్నిచోట్ల దొరకును.

----- కేశవర్ధిని ప్రోడక్ట్సు - కోయంబత్తూరు -----







ఆరోగ్యవంతులైన జనులు ప్రతిరోజూ
లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

– అది ప్రతిదిన* మలినములోని
క్రిములను కడిగివేయును!

* మనకు ప్రతిదినం తార్సపడే మామూలు మురికిలో క్రిములున్నాయి. మనలో ప్రతివారికీ యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం వుంది. అందుచేతనే చాలమంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

L. 261-50 TL

భారతదేశంలో తయారుచేయబడినది

నర్సు చెప్పుచున్నది:

# "జలుబులు త్వరితముగా నయమగును ఈ ఆధునిక పద్ధతితో"





మీ బిడ్డకు జలుబు చేసినపుడు అతని బాధను విక్స్ వేపోరబ్‌తో త్వరితముగా స్వస్థ పరచవచ్చును. గుండె మీదను, గొంతు మీదను, వీపు మీదను వరుండు సమయమున ఆహ్లాదకరమగు ఈ ఆయింటుమెంటును కొంచెము రుద్దుడు. చాలా దేశములలో నర్సులు, డాక్టర్లు విక్స్ వేపోరబ్‌ను సిఫార్సు చేయుచున్నారు. ఎందుచేతననగా:

**1.** దీనిని రాసిన వెంటనే విక్స్ వేపోరబ్‌లోని శక్తివంతమగు ఔషధగుణము చర్మము ద్వారా పనిచేయ నారంభించును. శిశువుయొక్క గుండె నొప్పిని తొలగించి, కఫమును సడలించి, బిగించుటను తగ్గించును.

**2.** అప్పుడే విక్స్ వేపోరబ్ వెడలించు గాఢమైన పరిశుభ్రమగు వాయువులను మీ బిడ్డ నిద్రించునపుడే శ్వాసకోశములోనికి పీల్చుకొనును. ఈ వాయువులు జలుబులకు మిక్కిలి అశక్తివంతమగు ఔషధమువలె పనిచేయును. ఇది ముక్కు బిగించుటను తొలగించి, గొంతు నొప్పిని స్వస్థపరచి, దగ్గుకు ఉపశమనము నిచ్చును.

రాత్రి అంతయు విక్స్ వేపోరబ్ ఇట్లు 2 ఆధునిక పద్ధతులతో శిశువు జలుబు మీద పనిచేయుచునేయుండును. తరుచుగా మరునాటి ఉదయమునకే జలుబు ఎక్కువ భాగము నయమగును.










జలుబులకు అత్యుత్తమమైన ఔషధము.

"కొంచెము రుద్దుడు!"

## విక్స్ వేపోరబ్




"విక్స్ వేపోరబ్" ఇది ట్రేడ్‌మార్కు

AD 322

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ ప్రపంచంలో వేషభాషలలో ఆడంబరం ఉంటేగాని మనిషి రాణించడు. మనిషిలో నిజంగా శక్తి సామర్థ్యాలు ఏపాటి ఉన్నదీ చూసేవాడుండడు, పై పటాటోపం చూసి ఎవరైనా సులువుగా నమ్మేస్తారు. ఈ పటాటోపంతో శక్తి లేనివాడుకూడా కొంతకాలంపాటు ప్రజలను యుక్తితో మోసగించవచ్చు. కాని ఎల్లకాలమూ ఇలా సాగటం చాలా కష్టం. ఎప్పటికైనా మనిషి శక్తికి పరీక్ష కలిగి తీరుతుంది.

"మరుగుజ్జు" [జాతక కథ]లో బోధిసత్త్వుడు అస్త్రవిద్యలో ఆరితేరినవాడే అయినా మరుగుజ్జు కావటంచేత ఎంత కాలానికీ ఉద్యోగం సంపాదించలేకపోతాడు. చిట్టచివరకు భీమసేనుడనే సాలెవాణ్ణి, అస్త్రవిద్య లేనివాణ్ణి వెంటబెట్టుకు పోయి, వాడికి కాశీ రాజువద్ద కొలువు సంపాదిస్తాడు. భీమసేనుడు ఒడ్డు పొడుగు మనిషి గనక సులువుగా ఉద్యోగం సంపాదిస్తాడు. పులిని చంప వలిసివచ్చినప్పుడు మరుగుజ్జే యుక్తి చెప్పి భీమసేనుణ్ణి పంపుతాడు. కాని శత్రురాజు పైకి వెళ్లి యుద్ధం చేయవలిసి వచ్చేసరికి భీమసేనుడికి ప్రాణంమీదికి వస్తుంది. అంత విషమపరీక్ష జరిగిన మీదటగాని రాజుగారు మరుగుజ్జు శక్తి సామర్థ్యాలను గుర్తించడు!

సంచిక 1
జనవరి 1957
సంపుటి 20

CHITRA

# అట్టవిూది బొమ్మ

తండ్రి కోరినప్రకారం, తనకు కాబోయే భర్తను వెతుకుతూ సావిత్రి సపరివారంగా బయలుదేరి, పుణ్యతీర్థాలను సేవిస్తూ, అడవులలో తపస్సు చేసుకునే రాజర్షుల కుమారులను చూడసాగింది. ఇలా పోతూండగా ఆమెకు ఒక ఆశ్రమం సమీపాన సత్యవంతుడనే యువకుడు కనిపించాడు.

సత్యవంతుడి తండ్రి ద్యుమత్సేనుడు ఒకప్పుడు సాళ్వదేశానికి రాజు. ఆయనకు కళ్ళు రెండూ పోవటంవల్ల శత్రురాజులు ఆయన రాజ్యాన్ని అపహరించి, ఆయనను అడవులకు పంపారు.

సత్యవంతుణ్ణిచూసి సావిత్రి అతడే తనకు తగిన భర్త అని నిర్ణయించింది. ఆమె తన యాత్ర ముగించుకుని మద్రదేశానికి తిరిగి వచ్చింది. సరిగా ఆమె చేరిన వేళకే నారదమునికూడా అశ్వపతిని చూడవచ్చాడు.

"అమ్మా, నీవు వెళ్లిన పని ఏమయింది? నీకు భర్త కాదగినవాడెవడైనా కనిపించాడా?" అని అశ్వపతి సావిత్రిని అడిగాడు. సావిత్రి తన తండ్రికి సత్యవంతుడి విషయం చెప్పి, అతనినే పెళ్లాడ నిశ్చయించానని తెలిపింది.

"మునీశ్వరా, సత్యవంతుడు నా కుమార్తెకు తగిన వరుడేనా? అతని సంగతి మీకేమైనా తెలుసునా?" అని అశ్వపతి నారదుణ్ణి అడిగాడు.

నారదుడు అనుమానంగా తల ఆడించి, "రాజా, ఈనాటి రాజకుమారులలో సత్యవంతుడితో పోలగలవాడు ఒక్కడుకూడా లేడు. కాని అతనికి ఒకటే లోపం ఉన్నది. నేటికి సరిగా సంవత్సరం నిండేసరికి అతని ఆయుర్దాయం నిండిపోతుంది. ఈ సంగతి తెలియక సావిత్రి అతనిని భర్తగా ఎన్నుకున్నది!" అన్నాడు. ఈ మాట విని దిగులుపడి అశ్వపతి, "అమ్మా, ఇతను గాక మరెవరినైనా కోరుకో! ఈ అల్పాయుష్కుడెందుకు?" అన్నాడు.

కాని సావిత్రి తన మనసు మార్చుకోలేదు. "మనోవాక్కాయాల ఆడది ఒకరినే వరించగలదు. ఒక్కరోజైనా నేను సత్యవంతుడికే భార్యగా ఉంటాను!" అని ఆమె గట్టిపట్టు పట్టింది.

ఆమె పట్టు విడవదని తెలిసి నారదుడు అశ్వపతితో, "రాజా, ఆమె ఇష్టప్రకారమే వివాహం చెయ్యి!" అని సలహా ఇచ్చాడు. అశ్వపతి సావిత్రి వివాహానికి ముహూర్తం పెట్టించి, ద్యుమత్సేనుడి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు. అక్కడ సావిత్రీ సత్యవంతులకు వేదోక్తంగా వివాహం జరిగింది.

# భయం లేనివాడు

ఒక దేశంలో ఒక నిరుపేద ఉండేవాడు. అతను బతుకుతెరువుకోసం దేశాంతరం పోదలిచి, 500 బళ్ళబిడారు ఒకటి బయలుదేరుతూంటే, దానివెంట తాను కూడా ప్రయాణమైనాడు.

బిడారు ఒక రాత్రి అరణ్య మధ్యంలో మజిలీ చేసింది. అందరూ గాఢ నిద్రలో ఉన్నారు. పేదవాడు మాత్రం అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

బిడారును దోచుకునే ఉద్దేశంతో, కొందరు దొంగలు రాళ్ళూ, కర్రలూ తీసుకుని అక్కడికి వచ్చారు. వారికి పేదవాడు పచార్లుచేస్తూ కనిపించాడు. "వీడు నిద్రపోయాక వద్దాం," అనుకుని దొంగలు వెళ్ళిపోయారు.

తెల్లవారేలోపుగా వాళ్ళు రెండు మూడుసార్లు వచ్చారు. కాని తెల్లవారిన దాకా ఆ పేదవాడు పచార్లు చేస్తూనేవున్నాడు. చివరకు తెల్లవారుజామున, దొంగలు బిడారును దోచే అలోచన మాని, తాము తెచ్చిన రాళ్ళూ, కర్రలూ అక్కడే పారేసి పోతూ, "ఈ మనిషి ధర్మాన మీ సొత్తు దక్కింది! వాడి కేదైనా బహుమానం ఇవ్వండి!" అని కేకలు పెట్టి వెళ్ళిపోయారు.

ఈ కేకలకు ప్రయాణీకులందరూ లేచారు. దొంగలు పారేసిపోయిన కర్రలూ, రాళ్ళూ చూశారు. "రాత్రి నిజంగా దొంగలు వచ్చారా? వాళ్ళను చూస్తే నీకు భయంవెయ్యలేదా?" అని పేదవాణ్ణి అడిగారు.

"నా కెందుకు భయం? దొంగలు దోచుకునేటందుకు నాదగ్గిర ఏమున్నది?" అని అడిగాడు పేదవాడు.





# మరుగుజ్జు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక బ్రాహ్మడికి కుమారుడుగా జన్మించాడు. అతను చాలా పొట్టివాడు కావటంచేత అందరూ అతన్ని మరుగుజ్జు అని పిలిచేవాళ్లు. అతను చిన్న తనంలోనే తక్షశిలకు వెళ్లి అక్కడ ఒక గురువువద్ద విలువిద్య నేర్చుకుని ఆ విద్యలో గొప్ప ప్రవీణుడయాడు.

ఆ తరవాత మరుగుజ్జుకు విలువిద్యతోనే పొట్టపోసుకోవాలన్న కోరిక కలిగింది. ఆ కారణంగా అతను చాలా దేశాలు తిరిగి, ఎందరో రాజులను సందర్శించి, తాను విలు విద్యా ప్రవీణుడినని చెప్పి, కొలువులోకి తీసుకోమని కోరాడు. కాని అతను పొట్టి వాడు కావటం మూలాన ఒక్క రాజు కూడా అతన్ని కొలువులోకి తీసుకోలేదు.

ఉద్యోగం సంపాదించటానికి ఏమి చెయ్యాలో, తన విద్యను ఏ విధంగా ఉప యోగపరుచుకోవాలో తెలియక, ఒకనాడు మరుగుజ్జు ఒక గ్రామంలోని సాలెవీధి గుండా పోతూఉండగా, అతనికి అజాను బాహు ఒకడు మగ్గంమీద పనిచేస్తూ కని పించాడు. మరుగుజ్జు ఆ మనిషిని సమీ పించి, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నాపేరు భీమసేనుడు," అని చెప్పాడు సాలెవాడు.

"ఇంత ఒడ్డూ పొడుగూ ఉన్నావు, ఇంత గొప్ప పేరు పెట్టుకున్నావు. సాలెపని చెయ్యటం కర్మమేం వచ్చింది నీకు?" అని మరుగుజ్జు అతన్ని అడిగాడు.

"నేనేం చెయ్యను? బట్టలు నేయటం తప్ప నాకింకే పనీ చేతకాదు!" అన్నాడు భీమసేనుడు.

"పుష్కలంగా సంపాదించుకునే ఉపాయం చెబుతాను, నా వెంట వస్తావా?" అని మరుగుజ్జు అడిగాడు.





భీమసేనుడు సంతోషంగా ఒప్పుకుని మరుగుజ్జు వెంట బయలు దేరాడు. ఇద్దరూ కలిసి కొద్ది రోజులలో కాశీరాజ్యం చేరారు.

"నీవు రాజుగారివద్దకు వెళ్లి, విలువిద్యలో గొప్పవాణ్ణని చెప్పుకుని, ఉద్యోగం అడుగు. నీ ఒడ్డూ పొడుగూ చూసి వెంటనే ఉద్యోగం ఇస్తారు," అని మరుగుజ్జు భీమసేనుడితో అన్నాడు.

"మరి నాకు విలువిద్య రాదే?" అన్నాడు భీమసేనుడు.

"నీకు రాకపోతే ఇబ్బంది లేదు. నాకా విద్య బాగావచ్చు. నన్ను నీ భటుడుగా వేసుకో. అవసరమైనప్పుడల్లా నేను నీకు సహాయపడుతుంటాను," అని మరుగుజ్జు ధైర్యం చెప్పాడు.

ఆ ప్రకారమే భీమసేనుడు కాశీరాజు వద్దకు వెళ్లి, తాను గొప్ప విలుకాడినని చెప్పి, సులువుగా కొలువు సంపాదించాడు. అతని జీతం పక్షానికి వెయ్యి రూపాయలు. మరుగుజ్జు అతనికింద భటుడుగా చేరాడు. ఇద్దరూ ఒకచోటే ఉంటూ భీమసేనుడికి రాజుగారిచ్చే జీతంతో సుఖంగా జీవయాత్ర గడపసాగారు.

ఇంతలో కాశీప్రజలకు ఒక విపత్తు సంభవించింది. కాశీనగరానికి సమీపాన గల అడవులలో ఉండే పెద్దపులి ఒకటి రహదారి కాసి దారే పొయ్యే మనుషులను చంప నారంభించింది. ఈ సంగతి తెలియగానే రాజుగారు భీమసేనుణ్ణి పిలిచి, ఫలానా చోట ఒక పెద్దపులి ఉండి దారే పోయే వారిని భయపెడుతున్నదనీ, ఆ పెద్దపులిని చంపి రమ్మనీ ఉత్తరువుచేశాడు.

భీమసేనుడు అందుకు అంగీకరించి రాజుగారివద్ద సెలవు పుచ్చుకుని, మరుగుజ్జువద్దకు వచ్చి, "ఇప్పుడు నాకీ బెడద వచ్చి పడింది. నేను ఆ పెద్దపులిని ఎలా చంపగలను? ఈ గండం తప్పే ఉపాయం చెప్పు!" అన్నాడు.

"నేను చెప్పినట్టు విను. పులిని నువు ఒక్కడివే చంపలేవు. ఊరి బయటికి వెళ్ల గానే పల్లెటూళ్ల జనాన్ని రెండువేలమందిని పోగుచేసుకుని పులి వచ్చే చోటికి వెళ్లు. పులి అరుపు వినగానే నువు ఏ పొదలో నన్నా దూరి దాక్కో. నీ వెంట వచ్చిన జనం పులిని చంపేస్తారు. పులి చచ్చిన దాకా దాగి ఉండి, ఆ తరవాత ఒక లత ఒకటి తెంచుకుని ఇవతలికి వచ్చెయ్యి. ఆ తరవాత పులి చచ్చిపోవటం చూసి కోపం తెచ్చుకో! 'దీనిని ఈ లతతో కట్టి రాజుగారి వగ్గరికి తీసుకుపోయి నా ప్రజ్ఞ చూపింతా మనుకున్నాను. దాన్ని చంపటానికై తే మీరంతా దేనికి? నేను చాలనా? ఈ పులిని చంపిన వాళ్లెవరో చెప్పండి, వాళ్లకి శిరచ్ఛేదం చేయిస్తాను!' అని కేకలుపెట్టు. జనం దడుచుకుని, పులిని చంపింది మేము కాదంటే మేము కాదంటారు. అప్పుడు నువు తిరిగి వచ్చి రాజుగారితో పులిని నువ్వే చంపినట్టు చెప్పవచ్చు. నువు చెప్పేమాట నిజం కాదనటానికి జనంలోని వారెవరూ సాహసించరు!" అని మరుగుజ్జు భీమసేను డికి ఉపాయం చెప్పాడు.

భీమసేనుడు అక్షరాలా మరుగుజ్జు చెప్పి నట్టే చేశాడు. పెద్దపులిని గ్రామస్థులంతా కలిసి చంపుతుంటే భీమసేనుడు పొదల



మధ్య దాగిఉండి, అది చచ్చినాక ఒక లత చేతబట్టి బయటికి వచ్చి, తను అలావెళ్లిన సమయంలో పులిని చంపేసినందుకు గ్రామస్థులమీద ఎగిరిపడ్డాడు. దాన్ని చంపిన వాళ్ల తల ఎగిరి పోతుందన్నాడు. గ్రామస్థులంతా భయపడి ఎవరి దారిన వారు జారుకున్నారు.

తరవాత భీమసేనుడు నగరానికి తిరిగి వెళ్లి, రాజును దర్శించి, "మహారాజా, తమరు అజ్ఞాపించిన ప్రకారం పెద్దపులిని చంపేశాను. ఇక రహదారిన ప్రయాణం చేసే ప్రజలకు ఎట్టి భయమూ లేదు!" అని విన్నవించాడు.

రాజుగారు భీమసేనుడి పరాక్రమానికి చాలా సంతోషించాడు. భీమసేనుడి ఖ్యాతి రెట్టింపయింది. అందరూ అతన్ని ప్రశంసించే వాళ్లే. ఈ ప్రశంసలు వింటూ భీమసేనుడు తాను నిజంగా మహావీరుణ్ణి అయి పోయాననుకుని, తనకు బంటుగా ఉన్న మరుగుజ్జును చిన్నచూపు చూడ నారంభించాడు. ఈ విషయం మరుగుజ్జు గ్రహించాడు గాని అంతగా పట్టించుకో లేదు.

ఇలా ఉండగా కాశీరాజ్యంమీదికి ఒక శత్రురాజు దండెత్తి వచ్చి, నగరాన్ని తన సైన్యాలతో చుట్టుముట్టి, "లొంగిపోతారా? లేక యుద్ధం చేస్తారా?" అని కబురు



చేశాడు. రాజుగారు భీమసేనుణ్ణి పిలిచి, "అవసరమైన బలాలను తీసుకుని శత్రువును జయించిరా!" అని ఆజ్ఞాపించాడు. అతనికి కవచం తొడిగి, విల్లు బాణాలు చేతికిచ్చి, ఒక ఏనుగుపై ఎక్కించి సరాసరి యుద్ధరంగానికి పంపారు.

భీమసేనుడికి ప్రమాదం జరగబోతుందని మరుగుజ్జుకు తెలుసు. తానుకూడా విల్లూ, బాణాలూ ధరించి భీమసేనుడి వెనకగా ఏనుగు మీద కూచున్నాడు. చుట్టూ అశ్వదళమూ, పదాతి దళమూ నడుస్తూండగా ఏనుగు యుద్ధభూమికి కదిలి వెళ్ళింది.

శత్రుసేనలు బారులు తీర్చి ఎదురుగా నిలబడి ఉండటం చూడగనే భీమసేనుడికి దడ పుట్టుకొచ్చింది, ముచ్చెమటలు పోశాయి, కాళ్లూ చేతులూ చల్లబడ్డాయి. అతను ఏనుగుమీదినుంచి కిందకి జారి తప్పించుకోవాలని చూశాడు. సమయానికి మరుగుజ్జు అతన్ని పట్టుకుని ఏనుగుకు కట్టి వెయ్యక పోయినట్టయితే భీమసేనుడు గుర్రాల కాళ్లకింద నలిగి నిష్కారణంగా చచ్చి పోవలిసిన వాడే!

ఇంత జరిగాక మరుగుజ్జు తానే నాయకత్వం తీసుకున్నాడు. అతను ఏనుగును అదిలించి సుడిగాలిలాగా శత్రుసేనల మధ్య చొరబడి, శత్రువులపై బాణాలవర్షం కురిపిస్తూ, సూటిగా శత్రురాజును సమీపించాడు. అతని ధాటికి శత్రుబలాలు చిందర వందర అయాయి. కొద్ది సేపట్లో శత్రురాజు గాయపడి, ఓడిపోయి, మరుగుజ్జుకు ఖైదీగా చిక్కాడు.

మరుగుజ్జు యుద్ధరంగంనుంచి విజయుడై తిరిగి రాగానే రాజుగారికి నిజమైన విలుకాడెవరో తెలిసిపోయింది. ఆయన మరుగుజ్జును సేనానాయకుడుగా నియమించాడు. మరుగుజ్జు భీమసేనుడికి అంతులేని కానుక లిచ్చి పంపేశాడు.






పూర్వం అవంతీనగరంలో, ఒక ముసలి వర్తకు డుండేవాడు. అతడు వయసులో వుండగా, ఖండాంతరాల్లోని అనేకదేశాలు తిరిగి, ఓడవర్తకంవల్ల చాలా ధనం గడించాడు. కాలక్రమాన వయసు ముడిరి, వృద్ధాప్యం మీదపడుతూండగా, అతడు తన వ్యాపారాన్ని కొడుకులకు అప్పగించాలని ప్రయత్నించాడు. కాని, అతడి ముగ్గురు కొడుకుల్లో పెద్దవాళ్లయిన జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఎందుకూ పనికిరాని వారుగా తయారయారు.

వాళ్లు దురలవాట్లకు లోనై, యింటి పట్టునే వుండేవాళ్లుకాదు. మూడవవాడైన పింగళుడుకి యింకా యిరవై ఏళ్లయినా నిండలేదు. ముసలివర్తకుడు దిగులుతో మంచం పట్టి, మరణించేముందు, తన యావదాస్తినీ ముగ్గురు కొడుకులకూ, భార్యకూ సమంగా పంచియిచ్చాడు తండ్రి మరణించగానే, పెద్దవాళ్లయిన జీవదత్తుడూ, లక్షదత్తుడూ తమకు సంక్రమించిన ఆస్తిని, విచ్చలవిడిగా ఖర్చుపెట్ట సాగారు. తన పెద్దకొడుకులు యిద్దరూ నిష్ప్రయోజకులని గ్రహించిన తల్లి, తన వాటాకు వచ్చిన ఆస్తితో చిన్నవాడైన పింగళుడి యింటికి వెళ్లి, అక్కడే వుండసాగింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ తమ చేజిక్కిన డబ్బు అయిపోగానే, తల్లిని వెతుక్కుంటూ, పింగళుడి యింటికి వచ్చారు. పింగళుడు అన్నలను చాలా ఆదరంతో ఆహ్వానించాడు. కాని, వాళ్లిద్దరూ



వస్తూనే పింగళుడిని కసిరికొట్టి, తల్లిదగ్గరకు వెళ్ళి, ఆమెను తమ యింటికి రావలసిందిగా అడిగారు.

తనంటే, ఏమాత్రం గౌరవంగాని, ప్రేమగాని లేని పెద్దకొడుకు లిద్దరూ, తనను వాళ్ల ఇంటికి రమ్మని అడగటంలోవున్న రహస్యం ఏమిటో ఆమె గ్రహించింది. భర్త యిచ్చి పోయిన ధనంకోసం, వాళ్లు తనమీద లేని ప్రేమ నటిస్తున్నారు. అందుకని ఆమె కొడుకు లిద్దరితో కొంచెంసేపు మంచిగా మాట్లాడి, 'మీరిద్దరూ పెద్దవాళ్లు, మీబ్రతుకు మీరు బ్రతగ్గలరు. పింగళుడు అలా కాదు. వాడికింకా పసితనమే వదలలేదు. కనుక, నేను వాడిదగ్గరే వుండటం, అన్నివిధాలా బావుంటుంది," అన్నది.

దానికి పెద్దవాళ్లిద్దరూ మండిపడి, "సరే, నువ్వు వాడిదగ్గిరే వుండు, మా అభ్యంతరం ఏమీ లేదు. కాని, మా తండ్రి నీపేర పెట్టి పోయిన ఆస్తిలో మా భాగం మాకు యిచ్చెయ్యి," అన్నారు.

"నే బ్రతికుండగానే, దాంట్లో మీకు భాగం ఎలా వస్తుంది?" అన్నది తల్లి.

"ఆ భాగం యిప్పుడు కాకపోతే, తరవాత మాకు దక్కుతుందన్న ఆశలేదు. ఆ డబ్బు కాస్తా కాజేసి, పింగళుడు నిన్ను అయిపూ అజా లేకుండా చేస్తే, మేము ఏం కావాలి?" అన్నారు పెద్దకొడుకులు.

అన్నలు యీ విధంగా మాట్లాడటం, పింగళుడికి చాలా అవమానకరంగా తోచింది. అతడు తల్లిదగ్గరకు వెళ్ళి, "అమ్మా, నువ్వు కావాలంటే, అన్నయ్యల దగ్గిరికే వెళ్లు. నీ ఆస్తిలో ఒక్క దమ్మిడీకూడా నా కవసరం లేదు," అన్నాడు.

తల్లి అందుకు అంగీకరించలేదు. దానితో పెద్దకొడుకు లిద్దరూ పట్టరాని కోపంతో తల్లిని కర్రలతో మోదసాగారు. చిన్నవాడైన పింగళుడు అడ్డుపడ్డాడు. దానితో వాళ్లు మరింత రెచ్చిపోయి, వాణ్ని చావ చితకబాదారు.





తల్లి ఎట్లాగో యింటినుంచి బయటపడి, యిరుగు పొరుగువాళ్లను పిలుచుకు వచ్చింది. వాళ్లు పెద్దకొడుకు లిద్దర్నీ గట్టిగా చీవాట్లుపెట్టారు. దానితో జీవదత్తుడూ, లక్ష దత్తుడూ యింటినుంచి బయటికి పోతూ, "మేం లోకజ్ఞానం లేని అర్భకులంకాదు. మీ యిద్దర్నీ న్యాయస్థానానికి పిలిపిస్తాం. ఆస్తి ఎక్కడికి పోతుందో చూస్తాం," అన్నారు.

వారం తిరక్కుండానే, జీవదత్తుడూ, లక్షదత్తుడూ అన్నంత పనీ చేశారు. వాళ్లు న్యాయస్థానంలో తల్లిమీదా, తమ్ముడిమీదా వ్యాజ్యం వేశారు. దానితో తల్లికీ, పింగళుడికీ న్యాయస్థానంనుంచి పిలుపు వచ్చింది. వాళ్లు న్యాయస్థానానికి వెళ్లారు. న్యాయాధిపతి పెద్దవాళ్లిద్దరిదగ్గిరా లంచం తీసుకుని వున్నవాడవటంచేత, తల్లికీ పింగళుడికీ వ్యతిరేకంగా తీర్పు చెప్పాడు.

పింగళుడు తనకూ, తల్లికీ అన్యాయం జరిగిందని పై న్యాయస్థానానికి అర్జీపెట్టుకున్నాడు. నెలరోజులు న్యాయస్థానం చుట్టూ తిప్పి, న్యాయాధిపతి చివరకు తల్లికీ, పింగళుడికీ అనుకూలంగా తీర్పు యిచ్చాడు.

తీర్పు తమకు అనుకూలంగా జరిగినా, మధ్యవర్తులమంటూ వచ్చి రాజీ రాయబారాలు జరిపిన వారికీ, న్యాయవాదులకూ పెద్ద మొత్తాలు యివ్వటంద్వారా పింగళుడూ, తల్లీ ఆస్తిఅంతా పోగొట్టుకున్నారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా కటిక దరిద్రులై పోయారు. వాళ్లిద్దరూ యిక పొట్ట గడిచే మార్గం లేక, వీధులవెంట తిరుగుతూ బిచ్చం ఎత్తసాగారు.

పింగళుడు తమకు కలిగిన దురదృష్టానికి చింతించలేదు. అతడు తల్లికి ధైర్యం చెప్పి, ఒక వల తీసుకుని చేపలు పట్టేందుకు నదికి వెళ్లాడు. చేపలుపట్టే వృత్తికి కొత్తవాడయినా, పింగళుడు ఆ సాయంత్రం వరకూ నదిలో వలవేసి చాలా చేపలు పట్టగలిగాడు. వాటిని బజారులో అమ్మి,

అ డబ్బుతో ఒక దుకాణదారు దగ్గిర, ఇంటికి కావలసిన సంబారాలన్నీ కొన్నాడు.

ఈ విధంగా పింగళుడు పగలల్లా కష్టించి చేపలుపట్టి, అవి అమ్మగా వచ్చిన డబ్బుతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. కొద్ది రోజులకే యీ సంగతి అన్న లిద్దరికీ తెలిసింది. వాళ్ళు పింగళుడు నదికి వెళ్ళిన సమయంలో బావురుమని ఏడుస్తూ తల్లి దగ్గిరకు వచ్చి ఆకలితో మలమల మాడి పోతున్నామని మొరపెట్టుకున్నారు. లోగడ తనకు ఎంత అన్యాయం చేసివున్నా, పుత్రప్రేమ కొందికీ, అవన్నీ మరిచిపోయి, తల్లి వాళ్ళిద్దరకూ చక్కని భోజనం పెట్టింది.

జీవదత్తుడూ. లకదత్తుడూ తల్లికి కృతజ్ఞత చెప్పుకుని, గత-లో తాము చేసిన అన్యాయాలకు పశ్చాత్తాపం వెలిబుచ్చారు. తల్లికూడా వాళ్లమీద జాలి తలిచి, తమ్ముడు లేని సమయంలో రోజూ వచ్చి, అన్నం తిని పోవలసిందని వాళ్లకు చెప్పింది. పనిపాట్లు చేసుకుని గౌరవంగా బ్రతకటానికి వళ్ళు వంగని పెద్దవాళ్ళిద్దరూ, యిందుకు చాలా సంతోషించి, కేరింతలు కొడుతూ వీధిలోకి వెళ్ళి పోయారు.

పింగళుడికి యివేమీ తెలియవు. అతడు ప్రతి దినం సూర్యోదయంతోపాటే లేచి వల తీసుకొని నదికి పోతూండేవాడు. ఒక





నాడు, ఎందుకనో అతడు ఎంతసేపు నదిలో వలవేసినా ఒక్క చేపకూడా పడింది కాదు. ఏమా యీ దురదృష్టం అనుకుంటూ, అతడు సూర్యాస్తమయం వరకూ ప్రయత్నించి, ఏమీ దొరకక, వల భుజాన వేసుకుని దిగాలుపడి యింటిమార్గం పట్టాడు. దారిలో ప్రతిదినం అతడు సామాను కొనే దుకాణంవాడు, ఆ రోజు పింగళుడు దుకాణం దగ్గిరకు రాకుండా పోవటం చూచి, అతడిని కేకవేశాడు.

పింగళుడు, దుకాణంవాడి దగ్గిరకు పోయి, ఆ రోజు తనకు నదిలో ఒక్కగానొక్క చేప అయినా దొరకలేదనీ, అందువల్ల తనదగ్గిర డబ్బు ఏమీలేదని చెప్పాడు. ఆ మాటలు వింటూనే దుకాణంవాడు నవ్వి, "నీకు అవసరమైన సంబారాలన్నీ రోజూ యిక్కడే కొనుక్కు పోతూండేవాడివి గదా! అలాంటప్పుడు, ఈ రోజు డబ్బు లేకపోతే మాత్రం ఏం పోయింది? అవసరమైన సరుకులు తీసుకుపో. రేపు డబ్బిద్దువుగాని," అన్నాడు.

పింగళుడు, దుకాణంవాడి దయకు కృతజ్ఞత చెప్పి, కావలసిన సామానులు తీసుకుని, వుత్సాహంగా బయలుదేరి, రోజూకన్న కొంచెం ముందుగా యిల్లుచేరాడు. ఆ సమయంలో, పింగళుడి అన్న లిద్దరూ,





యింట్లో సుఖంగా భోజనంచేస్తూ, తల్లితో కబుర్లాడుతున్నారు. హఠాత్తుగా పింగళుడు లోపలకు వచ్చేసరికి, వాళ్ళిద్దరూ గడబిడ పడి. సిగ్గుతో తలవంచుకుని పారిపోజూచారు.

పింగళుడు అన్న లిద్దర్నీ ప్రేమతో కౌగలించుకుని, "అన్నల్లారా! మీరు వున్నంతలో హాయిగా భుజించండి. జరిగిపోయిందేదో జరిగిపోయింది. మనం ఒక్క తండ్రి సంతానంగదా!" అన్నాడు.

తమ్ముడు యిలా అనేసరికి, పెద్దవాళ్లిద్దరికీ ఎక్కడలేని ఆనందం కలిగింది. వాళ్లు పింగళుడిని మెచ్చుకుని, "నువ్వు యింత మంచివాడివని మాకుతెలియదు, తెలిస్తే, అనవసరంగా నీమీద వ్యాజ్యంవేసి, మా ఆస్తితో పాటు నీదికూడా పోగొట్టేవాళ్లం కాదు," అన్నారు, విచారిస్తూన్నట్టు. కొడుకులు, విరోధభావం మాని, ఒకటైనందుకు తల్లి సంతోషించింది.

పింగళుడు ఆ మరసటి రోజునకూడా మామూలు వేళకే నదికి వెళ్ళాడు. ఆ రోజునకూడా సాయంత్రం వరకూ ప్రయత్నించినా వలలో ఒక్క చేపకూడా పడలేదు. అతడు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, యింటికి పోతూండగా, దుకాణంవాడు మళ్ళీ పిలిచి, సంగతి తెలుసుకుని, అప్పుగా మరికొంత సామాను యిచ్చాడు.





ఈ విధంగా వరసగా పదిరోజులు నదిలో చేపలు దొరకకపోయేసరికి, పింగళుడు విసిగి, పదకొండవరోజున, అక్కడికి క్రోసు దూరంలో వున్న చిలకసరస్సుకు చేపల కోసం వెళ్ళాడు.

చిలకసరస్సులో అతడు వలవేసి ఒడ్డున కూర్చునేంతలో, మైదానంమీద ఒక గుర్రపు రౌతు వస్తూన్న సూచనగా దుమ్ములేచింది. పింగళుడు ఆ వచ్చేవాడు ఎవడైవుంటాడా అనుకునేంతలో, రౌతు గుర్రాన్ని దూకిస్తూ, పింగళుడు వున్న చోటుకువచ్చి, "పింగళా! నువ్వు నాకో సాయం చేసిపెట్టాలి!" అంటూ గుర్రం దిగాడు.

తను ముక్కూ మొహం ఎరగనివాడు, సరాసరి దగ్గరకు వచ్చి, పేరుపెట్టి పిలిచే సరికి పింగళుడికి చాలా ఆశ్చర్యంకలిగింది. అతడు ఆ వచ్చినవాడికేసి అనుమానంగా చూస్తూ, "నాపేరు మీకెలా తెలుసు? మీకు కావలసిన సాయం ఏమిటి?" అన్నాడు.

ఆ ప్రశ్నలకు, ఆ కొత్తవాడు నవ్వి, "నీ పేరేమిటో, నువ్వేసమయంలో యీ చిలక సరస్సుదగ్గిర చేపలు పడుతూవుంటావో— అదంతా మా గురువుగారు, నువ్వు పుట్టక ముందే నాకు చెప్పాడు. అది నలభై ఏళ్ల కిందటిమాట! నే నడిగిన సాయం చెయ్యగలవా?" అన్నాడు.



"అదేదో చెప్పండి. ఇంతకూ మీ పేరేమిటో చెప్పారు కాదు!" అన్నాడు పింగళుడు వినయంగా.

"నాపేరు మండనుడు. పోతే, నువ్వు చేయవలసిన సాయం ఏమంత కష్టమైంది కాదు. నా చేతులు రెండూ తాడుతో వెనక కట్టివేసి, నన్ను ఎత్తుకుపోయి సరస్సులో పడవెయ్యి. కొద్దిసేపు తరవాత నా తల, ముందు నీటిపైన కనబడితే, వల వేసి నన్ను బయటికి లాగు. అలా కాక, కాళ్ళుగాని ముందు తేలితే, నువ్వు యీ గుర్రాన్ని పట్టణంలోకి తీసుకుపోయి, కాంచనమిశ్రుడు అనే వర్తకుడికి ఒప్ప చెప్పావంటే, అతడు నీకు నూరు మొహరీలు యిస్తాడు," అన్నాడు.

పింగళుడు, మండనుడు చెప్పినట్టు చేయటానికి అంగీకరించాడు. మండనుడు, గుర్రపు జీనుకు వేలాడుతున్న ఒక తాడు తెచ్చి, పింగళుడికి యిచ్చాడు. పింగళుడు, మండనుడి చేతులను వెనక్కు విరిచికట్టి, అతణ్ణి భుజాన వేసుకుని సరస్సు ఒడ్డునే నిలబడి, అతణ్ణి సరస్సులోకి విసిరివేశాడు.

ఒకటీ రెండు నిమిషాలకాలం సరస్సులో అలలు లేచి సర్దుమణిగిన తరవాత, మండనుడి కాళ్ళు ముందుగా నీటిపైకి తేలినై. "పాపం, చచ్చిపోయాడు!" అనుకుంటూ, పింగళుడు, మండనుడి గుర్రాన్ని తీసుకుని పట్టణంలోకి వెళ్ళాడు. అక్కడ అతడికి గొప్ప వర్తకుడైన కాంచనమిశ్రుడి దుకాణం తెలుసుకోవటం ఏమీ కష్టంకాలేదు. కాంచనమిశ్రుడు, పింగళుడినీ, అతడి వెంటవున్న గుర్రాన్నీ చూస్తూనే, "దురాశ దుఃఖంచేటు!" అంటూ గొణిగి, పెట్టెలో నుంచి, నూరు మొహరీలు తీసి పింగళుడికి యిస్తూ, "అబ్బాయ్, యీ సంగతి రహస్యంగా వుంచు. అది నీకు చాలా క్షేమంకూడా!" అన్నాడు.

(ఇంకా వుంది)






# గూని పెళ్లి కొడుకు

పూర్వం హంసల దీవిని ఒకరాజు ఏలుతూండేవాడు. ఆ రాజుకు ఇందుమతి అని ఒక్కతే కుమార్తె ఉండేది. ఆ పిల్ల అస్తమానం దాదివెంట తోటలో తిరుగుతూ, అక్కడ తాను చూసే ప్రతి పక్షిని గురించీ, జంతువును గురించీ ఆమెను అడిగి తెలుసుకుంటూ ఉండేది.

ఇందుమతి ఒకనాడు ఒక తొండను చూసింది. ప్రళయానికి ముందు ఈ తొండలు కొండలంతగా పెరిగేవనీ, వాటిని మొయ్యలేనని భూదేవి మొర పెట్టుకుంటే బ్రహ్మదేవుడు వాటిని పెరగకుండా చేశాడనీ దాది, ఆమెకు కథ చెప్పింది. ఇందుమతి ఆ తొండను పట్టుకుని, తీసుకుపోయి తండ్రి ఒడిలో వేసింది.

పరధ్యానంలో ఉన్న రాజుగారు దడుచుకున్నాడు. తరవాత ఆయనకు కూతురి మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది.

అమాయకురాలైన ఇందుమతి కిలాకిలా నవ్వి, "ఇంత చిన్న తొండను చూసే దడుచుకున్నావే! ఇది పెరిగి చాలా పెద్దదైతే అప్పుడు ఏం చేస్తావు?" అని తండ్రిని వేళాకోళం పట్టించింది.

"ఈ తొండ నీ అంత పెరిగేదాకా నీకు పెళ్లి చెయ్యను! ఏంచేస్తానో తెలిసిందా?" అని రాజు హుంకరించాడు.

"అదేంమాట, మహారాజా! చిన్నపిల్ల ఏదో తెలియక చేసింది! క్షమించండి!" అన్నారు మంత్రులూ వాళ్లూ.

రాజు మరింత బిర్రబిగిసి, "నా నోటంట వచ్చినమాట జరిగితీరవలిసిందే!" అన్నాడు.

రాజు ఇలా అన్నట్టు విని దాది ఇందుమతిని కౌగిలించుకుని, "నా చిట్టితల్లి కింక పెళ్లి కాదుగామాలు!" అని ఏడ్చింది.

"ఏడవకు, పిన్నీ! తొండ పెద్దదవుతుందిగా?" అన్నది ఇందుమతి.

డి. భావనారాయణ



"పెద్దది కాదు, తల్లీ! బ్రహ్మశాపం ఉందిగా?" అన్నది దాది.

అది మొదలు ఇందుమతి ప్రతిరోజూ, "ఓ బ్రహ్మదేవుడా! నా ప్రార్థన ఆలకించి తొండమీద నీ శాపం తీసిపారెయ్యి! అది నా అంత పెరిగేట్టుచెయ్యి!" అని రహస్యంగా ప్రార్థించేది.

బ్రహ్మదేవుడు శాపమే తీసేశాడో, లేక ఆ తొండ మామూలు తొండలవంటిది కాదో—అది రోజురోజుకూ ఒక్కొక్క అంగుళం చప్పున పెరుగుతూ, ఇందుమతికి యుక్తవయసు వచ్చేసరికి పెద్ద మొసలి ప్రమాణానికి పెరిగింది.

ఇదిచూసి రాజుగారు లోలోపల చాలా సంతోషించాడు. ఆయన కోపావేశంలో నోరు జారి కూతుర్ని అంతమాట అనేశాడేగాని, ఆ మాట నిలబెట్టుకోవలిసి వస్తుందేమోనని ఆయన చాలా భయపడ్డాడు.

ఒకనాడు మంత్రివచ్చి రాజుతో, "మహారాజా! అమ్మాయిగారి పెళ్లివిషయం ఏమి ఆలోచించారు?" అని అడిగాడు.

"అమ్మాయి పెంచిన తొండను చంపించి, దాని గుండెకాయ పైకి తీయించండి. అమ్మాయి పెళ్లి అని అన్ని దేశాలకూ ఆహ్వానాలు పంపండి. వచ్చినవారిలో ఆ గుండెకాయ ఏ జంతువుదో సరిగా చెప్పిన వారికి అమ్మాయి నిచ్చిచేద్దాం. ఎంతో తెలివిగలవాడైతే తప్ప కనుక్కో లేడు," అన్నాడు రాజు.

ఆ ప్రకారమే మంత్రి తొండను చంపించి, దాని గుండెకాయ భద్రంగా బయటికి తీయించి, ఒక గాజు జాడీలో పెట్టించాడు. తరవాత ఇందుమతి పెళ్లికి మంచిరోజు నిర్ణయించి, దూరదేశాలవాళ్లు కూడా రావటానికి తగినంత వ్యవధి ఉండేటట్టుగా ఆహ్వానాలు పంపాడు.

రాజకుమార్తె వివాహానికి రాజు చేసిన ఆలోచనగురించి వినగానే దాదికి చాలా

చిరాకు వేసింది. "ఈ రాజుగారికి ఆగ్రహం వచ్చినా చిక్కే, అనుగ్రహం వచ్చినా చిక్కే! ఆ గుండెకాయ తొండదని భూప్రపంచంలో ఎవడైనా కనుక్కో గలడా? పిల్లదానికి పెళ్లి కాకుండా ఉండేటందుకే ఆయన ఈ పని చేసినట్టుగా ఉంది!" అనుకున్నదామె.

పెళ్లి దగ్గిరపడింది. దేశదేశాలనుంచీ అతిథులు వచ్చి దిగుతున్నారు. వారికోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన విడిదికి వెళ్ళి, దాది ఒక్కొక్కరినే చూసింది. ఒక్కరూ ఆవిడకు నచ్చలేదు. "అందరూ అందరే! ఒక్కరూ మా ఇందూ కాలిగోరుకు సమం కారు," అనుకున్నది దాది.

ఇంతలో చిలకలదీవి రాజకుమారుడు వేంచేశాడు. మిగిలినవారిమధ్య అతను చుక్కల్లో చంద్రుడల్లే ఉన్నాడు. మంచి అందగాడు, ఇందుమతికి ఈడయినవాడు, బుద్ధిమంతుడు. ఎలాగైనా రాజకుమార్తెను అతను చేసుకునేటట్టు చూడాలని దాది నిశ్చయించుకున్నది.

ఆమె అంతఃపురానికి తిరిగివెళ్లి అక్కడ పనిచేసే నలుగురు గూనివాళ్లలో నమ్మకమైనవాణ్ణి ఒకణ్ణి పిలిచి, "ఓరీ, రేపే రాజకుమార్తె స్వయంవరం. విడిదిలో ఉండే వాళ్లందరినీ పిలిచి గాజుజాడీలో ఉండే



గుండెకాయ చూపించి, అది ఏ జంతువుదో కనుక్కోమంటారు. కనుక్కున్న వాళ్లకి అమ్మాయినిచ్చి పెళ్లిచేస్తారు. అందుచేత నువ్వు ఏం చెయ్యాలంటే, ఈ రాత్రి నువు అతిథులందరూ ఉన్న విడిదికి పోయి, ఎలాగైనా చిలకలదీవి రాజకుమారుణ్ణి కలుసుకుని, ఆయనతో రహస్యంగా, జాడీలో ఉండే గుండె తొండదని చెప్పు. ఈ పని చేసుకువచ్చావంటే నీకు మంచి ఇనామిస్తాను. రహస్యం మరొకరికి తెలియనిచ్చావో నీతల తీయించేస్తాను!" అన్నది.

గూనివాడు సరేనని తల ఊపాడు. కాని వాడు ఆరాత్రి విడిదికి వెళ్లలేదు, చిలకల

దీని రాజకుమారుణ్ణి కలుసుకోనూ లేదు. అంతమంది అతిథుల్లో ఆ రాజకుమారుణ్ణి పట్టుకుని, ఎవరికీ తెలియకుండా ఈ రహస్యం చెప్పటం చాలా కష్టమైన పని. అదికూడా గాక, గూనివాడికి దుర్బుద్ధి పుట్టింది. రాజకుమార్తెను పెళ్ళాడటానికి అవసరమైన రహస్యం తనకు తెలిసినప్పుడు దాన్ని మరొకరికి చెప్పడం దేనికి? ఆమెను తానే పెళ్ళాడవచ్చుగా! అందుచేత వాడు ఆ రాత్రి విడిదికి వెళ్లటానికి బదులు ఇంటికి వెళ్లి పడుకుని హాయిగా నిద్రపోయాడు.

మర్నాడు అతిథులందరూ రాజభవనానికి వచ్చారు. రాజుగారు వారందరికీ గాజు జాడీ చూపించి, "ఇందులో ఉండే గుండెకాయ ఏ జంతువుదో కనుక్కున్నవారికి నా కుమార్తెనిచ్చి పెళ్లి చేయటమేగాక అర్థ రాజ్యంకూడా ఇస్తాను!" అని చెప్పాడు.

ఎవరికి తోచిన జంతువుపేరు వారు చెప్పారు. కుక్కకన్న చిన్న జంతువు పేరు ఎవరూ చెప్పలేదు. కొందరు దాన్ని ఏనుగు గుండెకాయ అనికూడా చెప్పారు. అందరి వంతూ అయిపోయాక గూనివాడు ముందుకు వచ్చి, "మహారాజా, ఆ గుండెకాయ ఏ జంతువుదో నేను చెబితే నాకు అమ్మాయిగారి నిచ్చి పెళ్లిచేసి అర్ధరాజ్యం ఇస్తారా?" అని అడిగాడు.



"అన్నమాట తప్పేదిలేదు. తెలిస్తే చెప్పుకో!" అన్నాడు రాజు.

"అది తొండ గుండెకాయ!" అన్నాడు గూనివాడు.

అందరూ గొల్లుమని నవ్వారు. రాజుగారు గంభీరంగా, "నవ్వకండి! వాడు చెప్పినది నిజం. ఈ గుండెకాయ ఒక తొండది! అన్నమాటప్రకారం ఈ గూనివాడికి మా పిల్లనిచ్చి పెళ్లిచేస్తాం. అతిథులంతా ఉత్సవంలో పాల్గొని మమ్మల్ని ఆనందింపజేయ ప్రార్థన!" అన్నాడు.

అప్పటికప్పుడే గూనివాణ్ణి అలంకరించి పెళ్లికొడుకును చేశారు. ఆ తరవాత విందు జరిగింది. విందులో అనేక వినోదాలు ఏర్పాటు చేశారు. అందులో గూనివాడి మిత్రులైన ముగ్గురు గూనివాళ్లు ఒక జట్టుగా వచ్చి హాస్యంచేసి అతిథులను కడుపుబ్బ నవ్వించారు. తరవాత వాళ్లు పెళ్లికొడుకువద్దకు వచ్చి, "ఒరే, నువ్విప్పుడు రాజువవుతున్నావు, రాజకుమార్తెను పెళ్లాడుతున్నావు. మంచి బహుమానాలిచ్చి మమ్మల్ని సంతోషపెట్టరా!" అని అడిగారు.

గూనివాడికి కోపం వచ్చింది. వాడు తాను కూర్చున్న చోటినుంచి లేచివచ్చి, ముగ్గురినీ నడ్డివిరిగేట్టు తన్ని, "గూని వెధవల్లారా, పొండి అవతలికి!" అన్నాడు.





ఇదంతా చూస్తున్న రాజకుమార్తెకు ఆ గూనివాళ్లమీద జాలివేసి ఒక నౌకరుతో రహస్యంగా, "వాళ్లు ముగ్గుర్నీ నా గదికి తీసుకు పో. నేను ఇప్పుడే వచ్చి వాళ్లకు బహుమతు లిస్తాను," అని చెప్పింది.

భోజనాలు ముగియగానే ఇందుమతి గబ గబా మేడమీదికి వెళ్లి తన గదిలో ప్రవేశించింది. ఆమెకోసం గూనివాళ్లు వేచి ఉన్నారు. ఇందుమతి తలుపు గడియపెట్టి, గూనివాళ్ల కివ్వటానికిగాను తన పెట్టెలన్నీ తెరిచి నగలూ, బట్టలూ పైకి తీయసాగింది.

ఇంతలో బయట అడుగుల చప్పుడు వినపడింది. తలుపుమీద ఎవరో తట్టారు.

"ఎవరు వారు?" అన్నది ఇందుమతి. రాజుగారూ, పెళ్లికొడుకూ పలికారు.

ఏమి చెయ్యటానికీ పాలుబోక ఇందుమతి గూనివాళ్లను తన పెట్టెలలో పడుకోమని, మూతలువేసి తాళాలు బిగించింది. తరవాత వెళ్లి తలుపు తెరిచింది. ఇందుమతి తండ్రీ, కాబోయే భర్తా లోపలికి వచ్చారు.

వాళ్లు ఎంతకీ వెళ్లలేదు. ఇందుమతికి తండ్రి చాలా పెద్ద ఉపన్యాసం చెప్పాడు. అడితప్పటం తమ వంశంలో ఎన్నడూ లేదన్నాడు. తండ్రిమాట పాటించటం కూతురి విధి అన్నాడు. ఆడదానికి భర్తకు మించిన దైవం లేదన్నాడు. మహారాజుల్లో కూడా గూనివాళ్లున్నారన్నాడు. సూర్యాస్తమయం కాబోయే వేళవరకూ ఇందుమతికి నీతులు బోధించి మహారాజు తన కాబోయే అల్లుడితో పెళ్లి ప్రయత్నాలు చూడబోయాడు. లగ్నం సరిగా అర్ధరాత్రికి.

వాళ్లు వెళ్లిపోగానే ఇందుమతి మళ్లీ తలుపుమూసి పెట్టెలు తెరిచింది. కాని అప్పటికే గూనివాళ్లు ఊపిరి సలపక చచ్చిపోయారు. ఇందుమతి తన దాదిని పిలిపించి జరిగినదంతా చెప్పింది.

దాది వెంటనే ఊళ్లోకివెళ్లి ఒక అజానుబాహువయిన వాణ్ణి పట్టుకుని, "ఒరే, ఒక

రహస్యమైన పని నీవల్ల కావాలి. రాజుగారి ఇంటో ఒకమూట ఉన్నది. దాన్ని చీకట్లో పట్టుకుపోయి సముద్రంలో పారేసి రావాలి! ముందు పది రూపాయలిస్తాను. పని పూర్తి చేసుకు వచ్చాక మరో ఇరవై రూపాయ లిస్తాను!" అన్నది. కట్టె కొట్టి బేడా పావలా సంపాదించుకునే ఆ పేదవాడికి ఇది చాలా మంచి బేరంగా కనబడింది.

దాది వాణ్ణి వెంటపెట్టుకుని ఇందుమతి గదికి తెచ్చింది. అక్కడ ఒకగోతం ఉన్నది. కట్టెలుకొట్టేవాడు దాన్ని ఎత్తుకుని వెళ్లి పోయాడు. దాన్ని వాడు సముద్రంలో పారేసి, మిగిలిన ఇరవై రూపాయలూ పుచ్చుకోవ టానికి వచ్చాడు. కాని వాడు వచ్చేసరికి గోతం ఎప్పటిచోటే వున్నది.

"ఈ గోతం చాలా జిత్తులమారిది. నిన్ను ఏమార్చి తిరిగివచ్చింది. ఈమారైనా మోసపోకుండా దీన్ని సముద్రంలో పారేసి రా!" అన్నది దాది.

ఈసారి కట్టెలుకొట్టేవాడు సముద్రం లోతుకు వెళ్లి గోతాన్ని పారేసి వచ్చాడు. కాని వాడు వచ్చేసరికి మళ్లీ గోతం యథా స్థానంలో ఉన్నది.

కట్టెలుకొట్టేవాడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆ గోతాన్ని సముద్రం దగ్గిరికి




తీసుకుపోయి, గోతం తెరిచిచూశాడు. లోపల ఒక గూనివాడి శవం కనిపించింది.

"చచ్చినట్టు నటిస్తావా? నీ జిత్తులు నా దగ్గిర పారవు," అంటూ శవాన్ని గోతంలో నుంచి పైకిలాగి, తన చేగొడ్డలితో ముక్కలు ముక్కలుగా నరికి సముద్రంలో పారేసి, "ఇక రా, నీ ప్రజ్ఞ తెలుస్తుంది," అంటూ ఖాళీగోతం భుజాన వేసుకుని తిరిగివచ్చాడు.

వాడు రాజకుమార్తె గదికివెళ్లే మెట్లెక్క బోతుండగా వాడికన్న ముందు మెట్లెక్కు తున్న గూనిపెళ్లికొడుకు కనిపించాడు. "హరి, నీ కడుపుడకా! ముక్కలు ముక్కలు చేసినా మళ్లీ బతికివచ్చావా?

చూడు నిన్నిసారి ఏంచేస్తానో!" అంటూ, కట్టెలుకొట్టేవాడు మెట్లమీదిగా పరిగెత్తి, పెళ్లికొడుకును పట్టుకుని గొంతు పిసికేసి, గోతంలో కుక్కి తీసుకుపోయాడు. తరవాత వాడు, ఇంటిపక్కనే చితిపేర్చి, దానిమీద గూనివాణ్ణి గోతంతోసహా బూడిదచేసి, ఆ బూడిదను సముద్రంలో కలిపి, జామున్నర పొద్దుపోయి తిరిగివచ్చి, దాదితో, "అమ్మ గారూ, చాలా శ్రమపడ్డాను. మంచి బహుమానం ఇప్పించండి!" అన్నాడు.

"ఇంతసేపు ఏంచేశావు?" అని దాది ఆశ్చర్యంగా అడిగింది.

"ఆ గూనికుంక మూడుసార్లు పారేస్తే నాలుగోసారి నాకన్న ముందు తిరిగివచ్చాడు. జరీబట్టలు కట్టుకుని కులుకుతూ మెట్లెక్కి రావటం చూశాను. వాణ్ణి నాలుగోసారి పట్టుకుపోయి, ఇంత బూడిదచేసి సముద్రంలో కలిపేసి మరీవచ్చాను," అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

ఈ మాటలు వినగానే దాదికీ, ఇందుమతికీ కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు. దాది వాడికొక వరహాలమూట ఇచ్చింది. రాజకుమార్తె తన మెడలో ఉన్న ముత్యాలహారం ఇచ్చేసింది. వెయ్యి దణ్ణాలుపెట్టి వాడు వెళ్లిపోయాడు.

ముహూర్తం దగ్గిరపడుతున్నది. గూని పెళ్లికొడుకు జాడలేదు. దాదివెళ్లి రాజుతో, "మహారాజా, పెళ్లికొడుకు జాముకిందట మెట్లమీదినుంచి పడి నడుము విరిగి చనిపోయాడు. అందరికీ తెలిసిపోతుందని నేను వాణ్ణి రహస్యంగా దహనం చేయించేశాను. ఈమాత్రానికి అమ్మాయి పెళ్లి ఆగవలిసిన అవసరంలేదు. చిలకలదీవి రాజకుమారుడికిచ్చి పెళ్లిచెయ్యండి, ఈ డూ జోడుగా ఉంటుంది!" అని సలహా ఇచ్చింది.

రాజు ఆ ప్రకారమే చెయ్యటానికి సమ్మతించాడు. ముహూర్తానికి పెళ్లీ, తెల్లవారి అర్ధరాజ్యాభిషేకమూ వైభవంగా జరిగాయి.



# తెలివైన కోతి

ఒక కోతి నది అవతల వున్న అరణ్యానికి వెళ్ళేందుకు బయలుదేరింది. కాని నది నిండుగా ప్రవహిస్తున్నది. అందులో చాలా మొసళ్లుకూడా తిరుగుతున్నాయి.

కోతి కొంచెంసేపు ఆలోచించి, నది ఒడ్డునే ఉన్న ఒక మొసలిని, "మిత్రమా, కులాసాయేనా ?" అని అడిగింది.

"ఓ, కులాసాయే!" అంటూ మొసలి తోక ఆడించింది.

"కుటుంబంలో అందరూ కులాసాగా ఉన్నారా? ఎలా అయినా, నా కుటుంబం అంత పెద్దదికాదనుకుంటాను నీ కుటుంబం. మేం వందమందిమి!" అన్నది కోతి. "మేం అంతకంటే ఎక్కువే!" అన్నది మొసలి గర్వంగా.

"అసంభం, నేను నమ్మను !" అంటూ కోతి కిచకిచలాడింది.

"నమ్మవా? అయితే మావాళ్ళందర్నీ పిలుస్తానువుండు," అంటూ మొసలి, తన భార్యల్నీ, కుమాళ్లనీ, కూతుళ్లనీ, అల్లుళ్ళనీ—అందర్నీ కేకవేసింది.

కేక వింటూనే బిలబిలమంటూ నదిలో ఉన్న మొసళ్లన్నీ పైకి తేలాయి. కోతి తలాడిస్తూ, "అన్నీ కలిసి యాభైకంటె ఎక్కువ ఉన్నట్టులేదు," అన్నది. "నువు పొరబడుతున్నావు. లెక్కపెట్టుకు చూడు," అన్నది మొసలి.

కోతి నది ఒడ్డునే వున్న మొసలి వీపుమీదికి ఎక్కి, 'ఒకటి, రెండు, మూడు,' అంటూ ఒకదానిమీదినుంచి మరొదాని వీపుమీదికి ఎగురుతూ, నది అవతలి ఒడ్డుకు ఒక దూకుదూకి, "మీ అందరికీ చాలా కృతజ్ఞుణ్ణి. నది దాటేందుకు నాకు, భలే వంతెన అమర్చిపెట్టారు!" అని అడవిలోకి పరిగెత్తింది.



# నావికుడు సింద్‌బాద్

మనం కష్టాలకు గురి అయేసమయంలో వాటిని ఎట్లా భరించగలమా, అవి ఎప్పుడు గడిచిపోతాయా అనిపిస్తుంది. కాని అవి తొలగిపోయి సుఖమైన రోజులు వచ్చాక వెనక్కు తిరిగి చూసుకుంటే ఆ కష్టాలలోనే ఏదో ఆనందం కనిపించి, వాటిని గురించి అప్పట్లో, ఎందుకు అంతగా దిగులుపడ్డామా అని ఆశ్చర్యపోతాం.

నేను మూడు భయంకరమైన సముద్రయానాలు చేసి ఇంట సుఖంగా కుడిచి కూచునికూడా, ఈ భోగాలలో మునిగి తేలటంకంటె మళ్లీ ప్రపంచ పర్యటన చేసి అనుభవాలు సంపాదించటమే మేలనిపించింది. వర్తకంచేసి డబ్బు మరింత గడించాలని కూడా కోరిక కలిగింది. ఈ కోరిక రానురాను ఎంత తీవ్రంగా పరిణమించిందంటే నేనిక ఒక్క క్షణం కూడా ఇంట నిలవలేక పోయాను. తిరిగేకాలూ, తిట్టే నోరూ ఊరుకోవని ఇందుకే అంటారు.

విధి తోసినట్టుగా ఒకనాడు నేను నా ఇల్లూవాకిలీ, ఆస్తీపాస్తీ వదిలేసి, పూర్వంకన్న ఎక్కువ ఖరీదైన సరుకులు కొనుక్కుని వాటితో బస్రా చేరాను.

నాలుగవ సముద్రయానం

CHITRA

అక్కడ ఒక పెద్దనౌక పట్టుకున్నాను. ఆ నౌకలోనే అనేకమంది బస్రా వర్తకులు కూడా ప్రయాణమైనారు.

ఈ నౌక చాలా వేగంతో పోగలది. అది ఎన్నో దీవులకూ, ఎన్నో దేశాలకూ వెళ్ళింది. నౌక లంగరు దించినచోటనల్లా వర్తకం మహాచురుకుగా, అమిత లాభసాటిగా జరిగింది. కాని ఉన్నట్టుండి ఒకనాడు నడిసముద్రంలో సరంగు లంగరు దింపించి, "మన పని అయిపోయింది!" అని ఎలుగెత్తి అరిచాడు. ఆ క్షణంలోనే ఉప్పెన గాలి సాగింది. తాడిప్రమాణాన కెరటాలు నౌకచుట్టూ లేచి అనేకవేల ఏనుగుల శక్తితో నౌకను బాదసాగాయి. కొద్దిసేపట్లోనే నౌక వాటి తాకిడికి ముక్కలుచెక్కలైపోయింది. నౌకలోని సరుకంతా సముద్రుడు మింగేసి తన పొట్టన పెట్టుకున్నాడు. వర్తకులలో చాలామంది తమ సరుకులతోపాటే సముద్రంలో సమాధి అయిపోయారు.

అల్లా కటాక్షంవల్ల నేనూ, మరికొందరు వర్తకులూ ఒక విశాలమైన చెక్కలతెట్టును ఆశ్రయించ గలిగాం. అలలు మమ్మల్ని ఒకపూటల్లా అటూ ఇటూ కొట్టాయి. తరవాత పెద్దగాలి మమ్మల్ని ఒక ఒడ్డున పారేసింది. మేమందరమూ ఉప్పెన తాకిడికి మూడువంతులు చచ్చిఉండటంవల్ల,






ఆ రాత్రల్లా సముద్రతీరాన ఇసకలో ఎట్లా పడినవాళ్లం అట్లాగే సొమ్మసిల్లి బాగా నిద్ర పోయాం.

తెల్లవారి లేచేసరికి మాకు కాస్త శక్తి వచ్చినట్టని పించింది. అందుచేత మేం బయలుదేరి లోప్రాంతాలకేసి వెళ్లాం. కొంతదూరం వెళ్లేసరికి అంత దూరాన ఒక భవనం కనబడింది. మేము చూస్తుండ గానే ఈ భవనం ద్వారంలోనుంచి అనేక మంది కారునలుపు వ్యక్తులు పరిగెత్తు కుంటూ మా వైపు వచ్చారు. వారు జంతువుల చర్మాలు ధరించి ఉన్నారు. మాటా పలుకూ ఆడకుండా వారు మమ్మల్ని భవనంలోని విశాలమైన సావిడిలోకి తీసుకు పోయారు. అక్కడ ఎత్తయిన సింహాసనం మీద ఒకరాజు కూచుని ఉన్నాడు. కూచోమని ఆయన మాకు సైగచేశాడు.

క్షణంలో నల్లటివాళ్లు మా ముందు కంచాలలో కనీవినీ ఎరగని కూరలతో భోజనం ఉంచారు. వాటిని చూస్తే నాకు అంట బుద్ధికూడా కాలేదు. కాని నా మిత్రులు బాగా ఆకలి గొనిఉన్న కారణం చేత అవురావురుమని కంచాలలో పెట్టిన ఆహారం తినేశారు. నేనా ఆహారం తినక పోవటం మేలయిందని నాకు తరవాత తెలిసి వచ్చింది.

నా స్నేహితులైన వర్తకుల ఆకలి ఆహారం తింటున్నకొద్దీ జాస్తీ కాసాగింది. వారు గంటల తరబడి తమ కంచంలో వడ్డించినదల్లా ఆత్రంగా తినసాగారు. అంతకంతకూ వాళ్లు తినే పద్ధతికూడా పశువులు తినే ధోరణిలోకి దిగసాగింది.

వాళ్లు ఒకవంక తింటూండగానే నల్లవాళ్లు ఒకజాడీలో ఏదో లేపనం తెచ్చి వాళ్ల శరీరాలకు పూయసాగారు. దీని ప్రభావం చూసితీరాలి. నా మిత్రుల పొట్టలు ఒక్కొక్క అంగుళమే ఉబ్బుకురావటం నేను కళ్లారా చూశాను. పొట్టలు ఉబ్బిపోతున్నకొద్దీ వారి




ఆకలికూడా హెచ్చిపోయింది. ఆ ఆకలి ఎంతకీ తీరేదిగా లేకపోవటం చూసి నేను నిర్ఘాంత పోయాను.

ఇదంతా కళ్లారా చూస్తూ నేను ముద్ద ఎట్లా నోటపెట్టుకునేది! నా శరీరానికి లేపనం పూయవస్తే నేను నిరాకరించాను. ఇదీ నాకు మేలే అయింది. ఎందుచేతనంటే, వీళ్లు నరభక్షకులనీ, చంపితినటానికే వాళ్ళా విధంగా మనుషులకు కొవ్వుపట్టేట్టు తినిపిస్తారనీ నాకు త్వరలోనే తెలిసింది. ఇంకో ఘోరమేమంటే, వీళ్లరాజు రోజుకొక మనిషిని కాల్చుకుతింటాడు; వీళ్లుమటుకు పచ్చిమనుషులనే పీక్కుతింటారు.

ఈ విషయాలు నాకు తెలియవచ్చాక నా గతీ, నా స్నేహితుల గతీ ఏమవుతుందోనని నేను చాలా ఆందోళనచెందాను. పైగా నా మిత్రులపొట్టలు పెరిగిపోతున్నకొద్దీ వాళ్ల వివేకం క్షీణించి పోతున్నట్టు స్పష్టమయింది. చిట్టచివరకు వాళ్లు వేటపశువుల్లాగా అయిపోయారు. ఆ నల్లటివాళ్లు వీళ్లని దూరంగావున్న పచ్చికమైదానాలమీదికి మేపటానికి తోలుకు పోయారు!

నేను భయంతోనూ, ఆకలితోనూ చిక్కిశల్యమైపోయాను. నా చర్మం ఎముకలకు అంటుకు పోయింది. అక్కడి వాళ్లకు నాయందు కొంచెంకూడా ఆసక్తి లేకుండా పోయింది. వారు నన్ను మరిచిపోయారు. అందుచేత నేను ఒకరోజు వాళ్ల భవనం నుంచి తప్పించుకుని దీవికి అడ్డంపడి నడవ సాగాను. దారిలో నాకు నా మిత్రులను తోలుకుపోతున్న నల్లటివాళ్లు తటస్థపడ్డారు. నేను చెట్లచాటున దాక్కుని వారి కంటపడకుండా తప్పించుకున్నాను.

నేనా రాత్రి అంతా ఆగకుండా నడిచాను. నరభక్షకులనుంచి తప్పించుకుపోవాలనే ఆదుర్దాలో నాకు నిద్రకూడా రాలేదు. దారివెంబడి కందమూలాలు తింటూ, ఎడతెగకుండా ఆరు రాత్రులూ,

అరు పగళ్లూ నడక సాగించి చివరకు నాలాటి మానవులుండే దేశం ఒకటి చేరాను. ఇది దీవికి అవతలి తీరంవద్ద ఉన్నది. వారు నా భాషే మాట్లాడుతూ నన్ను చుట్టుముట్టారు. నే నాభాష విని ఎంతో కాలమయింది. నేను వారితో నా కష్టాలన్నీ చెప్పుకున్నాను. ప్రాణాలతో బయటపడ్డందుకు నన్ను అభినందించి నాకు అన్నపానాదులు అమర్చారు. ఒక గంటసేపు విశ్రాంతి తీసుకున్నాక వారు నన్ను తమ పడవలలో ఎక్కించుకుని తమ రాజువద్దకు తీసుకు పోయారు. ఆ రాజుగారు మరొక దీవిలో ఉంటున్నాడు.

రాజధానిలో జనసమ్మర్దం హెచ్చుగా ఉంది. అంగళ్లలో సమస్తమైన సరుకులూ ఉన్నాయి. వీధులు విశాలంగా నిర్మలంగా ఉన్నాయి. ఈ వీధులవెంట అనేకమంది మేలుజాతి గుర్రాలమీద జీను లేకుండా సవారీఅయి అటూ ఇటూ వెళుతున్నారు. నేను రాజుగారిని దర్శనంచేసుకుంటూనే, "మీ దేశంలో రౌతులు జీనులేకుండా గుర్రాలమీద సవారీఅయి వెళుతున్నారు, కారణమేమిటి? సవారీకి జీనులుండటం మరింత సుఖంకాదా?" అని అడిగాను.

"జీనులేమిటి? వాటిని మేమెన్నడూ చూడనేలేదే?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.



"అలా అయితే, అనుమతి ఇవ్వండి, నేను ఒకటి రెండురోజుల్లో జీను తయారు చేసి ఇస్తాను. దానిలో ఉండే సౌకర్యం మీకే తెలిసివస్తుంది," అన్నాను.

రాజు సరే నన్నాడు. పనిమంతుడైన వ్రడంగి నొకణ్ణి పట్టుకుని, దగ్గిర ఉండి వాడిచేత కొయ్యజీను తయారుచేయించాను. తరవాత దానికి ఈకలు కూరినమెత్త ఒకటి కుట్టించి, దానికి తోలుతొడుగూ, జలతారు అంచులూ, రంగురంగుల కుచ్చులూ ఏర్పాటుచేయించాను. తరవాత ఒక కమ్మరి వద్దకు వెళ్ళి, కళ్ళెం తగిలించే ఇనపముక్క చేయించాను, రెండు రికాబులు చేయించాను. నేను వాడి గొంతుమీద కూచోవటం వల్ల నాకు కావలిసిన విధంగా వాటిని తయారుచేసి ఇచ్చాడు.

అన్నీ చక్కగా అమరినాక నేను అశ్వ శాలకు వెళ్ళి అక్కడ ఉన్న గుర్రాలలో ఉత్తమమైన దాన్ని ఏరి, దానికి జీనూ, కళ్ళాలూ తగిలించాను. దాని మెడకు నీలం కుచ్చులు అమర్చాను. తరవాత దాన్ని తీసుకుపోయి రాజుగారి ముందుంచాను. రాజుగారు గుర్రం ఎక్కి జీనులోగల సౌక ర్యాలు, గుర్రాన్ని నడపటంలో కొత్తగా వచ్చిన సులువూ తెలుసుకుని నాకు అంతు లేని ధనమూ, బహుమతులూ ఇచ్చాడు.



తరవాత మంత్రిగారు నన్ను పిలిచి తన గుర్రానికకూడా అటువంటి జీను తయారు చేయించమని అడిగాడు. నేను ఆయన కోరికకూడా తీర్చాను. అదిమొదలు ఆ దేశంలో ఉన్న పెద్దపెద్దవాళ్లంతా నాచేత జీనులు తయారుచేయించుకుని నాకు అపరిమితమైన డబ్బు ఇచ్చారు. నేను దేశంలో కల్లా ధనికుణ్ణి అయిపోయాను!

రాజుగారికీ నాకూ గాఢమైన స్నేహం ఏర్పడింది. ఒకనాడాయన నాతో, "చూడు, సింద్‌బాద్! నువు నాకు ఆప్తులందరిలోకీ ఆప్తుడివైపోయావు. నువు పరదేశీయుడివనే భావంకూడా నాలో కలగటంలేదు. అందుచేత నా కోరిక ఒకటి తీర్చగలవా?" అని ఆప్యాయంగా అడిగాడు.

"ఏలినవారు అనటమూ, నేను కాదనటమూనా? సెలవియ్యండి," అన్నాను.

"అయితే నువ్వొక అందమైన స్త్రీని పెళ్ళాడాలి. ఆమె ఉత్తమవంశాన పుట్టినది. చాలా ధనం కలది. ఆమెను వివాహం ఆడితే నువ్విక్కడే ఉండిపోతావని నా ఆశ. కాదనకు, సింద్‌బాద్!" అన్నాడు రాజుగారు.

నా కేమనాలో తోచలేదు. నా బుర్రంతా పాడయిపోయి నట్టయింది. నే నాయన కేసి చూడలేక తల వంచుకున్నాను.

"మాట్లాడ వేమోయ్?" అన్నాడు రాజుగారు.

"మహారాజా, నేను తమ సేవకుణ్ణి. తమ యిష్టప్రకారం చెయ్యండి," అన్నాను.

వెంటనే ఆయన వధువునూ, కాదీనీ సాక్షులనూ పిలిపించి నా వివాహం జరిపించేశాడు. ఆమె అందగత్తె మాత్రమేకాక చాలా సంపన్నురాలు. ఆమెకు అనేకమైన భవనాలూ, వస్తువాహనాలూ, భూములూ ఉన్నాయి. రాజుగారు మేం ఉండటానికి ఒక దివ్యమైన భవనమూ, అనేకమంది నౌకర్లూ, చాకర్లూ, ఆడ మగ బానిసలూ బహూకరించాడు. (ఇంకా వుంది)





# పుత్రవాత్సల్యం

ఒకప్పుడు పాటలీపుత్రాన్ని ఏలిన శూరవర్మ చాలా కఠినహృదయుడు. యుద్ధరంగంలో ఆయన ఎంత పరాక్రమం చూపేవాడో, ఓడిపోయినవారిపట్ల అంత క్రూరంగాకూడా ప్రవర్తించే వాడు. ఆయన పరిపాలనలో నేరస్థులకు తరుచు మరణదండన జరుగుతుండేది. మరణదండన విధించినవారిని ఉరితీయుటమో, శిరచ్ఛేదమో చెయ్యటానికి మారుగా, శూరవర్మ వారిని సింహాలతోనూ, పులులతోనూ పోట్లాడించి వాటిచేత చంపించి తాను వినోదంచూసేవాడు.

ఇటువంటి కిరాతకుడై ఉండికూడా శూరవర్మకు తన కొడుకుపైన చాలా ప్రేమ. ఆయనకు ఉన్నదే ఒక్క కొడుకు. అతని పేరు చంద్రవర్మ. తండ్రి ఎంత కఠిన హృదయుడో చంద్రవర్మ అంత సుకుమారమైన మనస్సుకలవాడు. ఎవరి మనసు బాధపడినా అతను నొచ్చుకునేవాడు.

చంద్రవర్మకు, సుబుద్ధి అని ఒక ప్రాణస్నేహితుడుండే వాడు. వాళ్ళు యిద్దరూ ఒకే వయసువాళ్ళు. చూడటానికికూడా ఇంచుమించు కవలపిల్లలాగా ఒకే పోలిక గలిగి ఉండేవాళ్ళు.

చంద్రవర్మా, సుబుద్ధీ ఒకే గురువువద్ద చదువుకున్నారు, అస్త్రవిద్య నేర్చుకున్నారు. వారిద్దరూ ఇరవై ఏళ్ళప్రాయంవాళ్ళయి ఉండగా శూరవర్మ జయంతదేశంపై దండెత్తిపోతూ, సేనలవెంట తన కుమారుణ్ణీ, అతని స్నేహితుణ్ణీకూడా యుద్ధానికి తీసుకుపోయాడు. చంద్రవర్మ యుద్ధంలో పాల్గొనటం అదే మొదలు.

యుద్ధం త్వరలోనే ముగిసింది. జయంత దేశపు రాజైన రణజితుడు చిత్తుగా ఓడిపోయి, తన కోట విడిచి అడవులలోకి వెళ్లి దాక్కున్నాడు. ఆయన దాగిన స్థలం బహు కొద్దిమందికే తెలుసు.

కె. రామనాథబాబు



శూరవర్మ కోటలో ప్రవేశించిన వెంటనే రణజితమహారాజు కుమార్తె ఊర్మిళ కన్నీరు కార్చుతూ ఆయన కంటపడింది. ఊర్మిళ అసాధారణమైన అందగత్తె. జయంతదేశపు రాజుకు ఆమె ఒక్కతే కుమార్తె. ఆమెను చూస్తూనే శూరవర్మ పెళ్ళాడ నిశ్చయించాడు. తాను గెల్చిన రాజ్యంకన్న ఊర్మిళ ఆయనకు ఎక్కువగా కనిపించింది.

ఊర్మిళను చూడగానే చంద్రవర్మకూడా ఆమెను ప్రేమించాడు. ఆమె కన్నీరు అతన్ని చాలా కలవర పరిచింది. జయంత దేశాన్ని ఓడించటంలో తానుకూడా పాల్గొ న్నందుకు అతనికి చాలా కష్టంవేసింది. తన తండ్రి శత్రువులపట్ల చాలా క్రూరుడు. ఊర్మిళనుగాని, ఆమె తండ్రినిగాని అయన ఎక్కడ సింహాలకు వేసిపోతాడో అని అతను చాలా భయపడాడు.

అతను అవకాశం చూసుకుని ఊర్మిళ ఉండే గదికి వెళ్ళి ఆమెతో, "ఓడిపోయి నందుకు విచారించకు! నీ కంట నీరు కారుతూంటే నాకు చాలా బాధగా వుంది! ఇది చూసేకన్న నేను యుద్ధభూమిలో దెబ్బతిని రక్తం కార్చినా ఇంత బాధ పడను. నా తండ్రి నా మాట తీసివెయ్యడు. ఆయనతో చెప్పి, మీకూ మాకూ గౌరవ ప్రదంగా ఉండే పద్ధతిలో సంధి జరిగేటట్టు చూస్తాను!" అన్నాడు.

మొదట ఊర్మిళకు చంద్రవర్మమీద ఆదరభావం లేదు. ఎందుకంటే, తన తండ్రికి కష్టాలు తెచ్చిన శత్రుకోటిలో ఈ చంద్రవర్మకూడా ఉన్నాడు. కాని, అతని మాటలు వింటున్నకొద్దీ ఊర్మిళకు అతని పైన మంచి అభిప్రాయం ఏర్పడింది. ఆమె క్రమంగా తన ఆశలన్నీ అతనిమీదనే పెట్టుకోసాగింది.

తనలాగే తన కొడుకుకూడా ఊర్మిళను ప్రేమిస్తున్నాడని శూరవర్మకు తట్టలేదు.

కాని ఊర్మిళ చంద్రవర్మను ఎట్లాగైనా మంచి చేసుకుని తన తండ్రికి లాభం చేకూర్చాలని ప్రయత్నిస్తున్నట్టు ఆయన అపోహపడ్డాడు. ఆయన వెంటనే తన కొడుకును పిలిచి, "నాయనా, రణజితుడు పరారీ అయినాడు. సంధిసంప్రతింపులు సాగించటానికి ఎవరూ లేరు. రణజితుడికోసం వెతికిస్తున్నాను. ఇక్కడి వ్యవహారాలు ఇంతలో ముగిసేటట్టు లేవు. కనక నువు మన శిబిరానికి వెళ్ళి అక్కడి పరిస్థితులు చూసుకో! సంధి జరిగే సమయానికి నీకోసం కబురు చేస్తాను!" అన్నాడు.



ఊర్మిళను విడిచి వెళ్లటం చంద్రవర్మకు ఇష్టంలేదు. కాని తండ్రి ఆజ్ఞ శిరసావహించక తప్పదు. అతను తన ప్రాణస్నేహితుడైన సుబుద్ధిని పిలిచి, "అన్నా, ఊర్మిళను వెయ్యి కళ్లతో కనిపెట్టివుండు. ఆమెకు మనం తప్ప వేరే దిక్కులేరు. నాయనగారి గుండె రాతి గుండె, నీకు తెలుసుగదా! అందుచేత ఏ రోజు వార్తలు ఆ రోజు నాకు రహస్యంగా పంపుతూ వుండు. ఊర్మిళ ఎటువంటి పరిస్థితిలోనూ విచారపడకుండా చూడవలసిన బాధ్యత నీది!" అని హెచ్చరించి, సైనిక శిబిరానికి వెళ్ళిపోయాడు.

కుమారుడు వెళ్ళిపోగానే శూరవర్మ ఊర్మిళవద్దకు వెళ్లి ఆమెతో చాలా మంచిగా, "నీవు నన్ను పగవాడిలాగా చూడనవసరంలేదు. నేను మీ వంశానికిగాని, రాజ్యానికిగాని ఎట్టి అపకారమూ చేయదలచలేదు. ఒక్క షరతుపైన నేను మీ తండ్రితో సంధిచేయటానికి సిద్ధంగా ఉన్నాను. ఆ షరతు ఏమిటంటే, నీవు నన్ను పెళ్ళాడాలి. ఈ సంగతి మీ తండ్రిగారికి కబురు చేయవచ్చు," అని చెప్పాడు.

ఆ తరవాత శూరవర్మ తన భటులతో రాజకుమార్తెను ఖైదీగా చూడవద్దనీ, ఆమెను కోటలో స్వేచ్ఛగా తిరగనిమ్మనీ

చెప్పాడు. కాని ఆయన తన నమ్మిన బంటులను ఇద్దరిని పిలిచి, ఊర్మిళతో ఎవరెవరు మాట్లాడుతారో వేగు కాయమని హెచ్చరించాడు.

శూరవర్మ కోరిన ప్రకారం తండ్రికి కబురు పంపమని ఊర్మిళ తమ మంత్రితో చెప్పి, తనతో ఒకసారి మాట్లాడి వెళ్లమని సుబుద్ధిని పిలవనంపింది. సుబుద్ధి ఊర్మిళా దేవి గదిలోకి వెళ్లటం చూసిన వేగులవాళ్లు శూరవర్మకీ వార్త తెలిపారు. సుబుద్ధిని తక్షణం పెడరెక్కలు విరిచికట్టి ఖైదులో వెయ్యవలిసిందిగా శూరవర్మ తన భటులకు అజ్ఞ ఇచ్చాడు.

వారు వచ్చేలోపుగా సుబుద్ధి జరిగినదంతా తెలుసుకున్నాడు. శూరవర్మ ఊర్మిళను పెళ్ళాడ నిశ్చయించాడు. ఆమె చంద్రవర్మనే పెళ్ళాడ కోరుతున్నది. ఈ విషయం ఏవిధంగానైనా చంద్రవర్మకు తెలియజేస్తానని సుబుద్ధి ఊర్మిళకు మాట ఇచ్చాడు. కాని ఇంతలోనే రాజభటులు వచ్చి ఆతన్ని పట్టుకుపోయి ఖైదులో వేశారు.

మంత్రి పంపిన కబురు అంది, అరణ్యంలో రహస్యంగా దాగివున్న రణజిత మహారాజు తన కోటకు రహస్య మార్గాన తిరిగివచ్చాడు. తన కుమార్తెను శూరవర్మ పెళ్ళాడటానికి ఆయన అమోదించాడు.



సంధిపత్రం తయారుచేయటానికీ, ఊర్మిళను శూరవర్మకిచ్చి వివాహం చెయ్యటానికీ మంచి రోజు నిర్ణయించ బడింది.

అక్కడ సైనిక శిబిరంలో ఉన్న చంద్రవర్మకు సుబుద్ధినుంచి ఏ వార్తా రాలేదు. అతను ఆందోళనచెందాడు. దీనికి తగ్గట్టుగా సైనికులలో కొన్ని పుకార్లు బయలుదేరాయి. రణజితమహారాజు కోటకు తిరిగి వచ్చాడనీ, త్వరలోనే సంధి జరగబోతున్నదనీ, తామంతా పాటలీపుత్రానికి తిరిగిపోవచ్చుననీ సైనికులు చెప్పుకోసాగారు.

ఒక రాత్రి చంద్రవర్మ సామాన్య దుస్తులతో సైనిక శిబిరంనుంచి కోటకు బయలుదేరాడు. దారివెంబడి జనం చెప్పుకునే మాటలనుబట్టి మర్నాడే తన తండ్రి ఊర్మిళను వివాహం చేసుకోబోతున్నాడనీ, రాజద్రోహ నేరంకింద సుబుద్ధిని ఖైదుచేశారనీ అతనికి తెలిసింది. అతను కోట ప్రవేశించి నేరుగా ఖైదుకు వెళ్ళాడు. అక్కడి పహరావాళ్లతో, తాను శూరవర్మ కుమారుణ్ణని చెప్పి, సుబుద్ధివద్దకు తనను తీసుకుపొమ్మన్నాడు.

"బాబూ, మీ తండ్రిగారు ఆయనను రేపు సింహాలకు వేస్తారు. ఆయనను ఇప్పుడు పలకరించటం మంచిదికాదు," అన్నారు పహరావాళ్లు.





చంద్రవర్మకు ఈ మాటలు వినగానే కంపరం ఎత్తింది.

"అందుకే ఈ పూట అతనినుంచి ఒక ముఖ్యమైన రహస్యం తెలుసుకోవాలి. నన్నతని దగ్గిరికి వెంటనే తీసుకుపొండి!" అన్నాడు చంద్రవర్మ.

ఒక పహరావాడు చంద్రవర్మను వెంట బెట్టుకుని సుబుద్ధి ఉన్న ఖైదుకు తీసుకు వెళ్ళాడు. అప్పటికి బాగాపొద్దుపోయినా యింకా సుబుద్ధి మేలుకునే ఉన్నాడు. అతను మోకాళ్లమీద చేతులు ముడుచుకుని వాటిమీద ముఖం వాల్చుకుని గోడకు చేరగిలబడి కూచున్నాడు.



చంద్రవర్మ, "సుబుద్ధీ!" అని పిలిచాడు. సుబుద్ధి వంచిన తల ఎత్తకుండానే, "ఎవరు నువు? నీతో నాకు పనిలేదు, యిక్కడినుంచి వెళ్లు!" అన్నాడు.

చంద్రవర్మ పహరావాడితో అవతలికి పొమ్మని చెప్పి, తలుపు మూసి సుబుద్ధి వద్దకు వెళ్లి, "సుబుద్ధీ, నేను చంద్రవర్మను!" అన్నాడు.

సుబుద్ధి లేచినిలబడి చంద్రవర్మను కౌగిలించుకున్నాడు.

"మనం దుస్తులు మార్చుకుందాం! నీ బదులు నేను ఖైదులో కూచుంటాను. నా దుస్తులతో నువు తప్పించుకో!" అన్నాడు చంద్రవర్మ.

"అసంభవం! రేపు నన్ను సింహాలకు వేస్తారు!" అన్నాడు సుబుద్ధి.

"నీకు ఈ దుర్గతి పట్టటానికి నేనే కారకుణ్ణి. నా మూలంగా నువ్వెందుకు చావాలి? త్వరగా నా దుస్తులు వేసుకో!" అన్నాడు చంద్రవర్మ.

ఎంతకూ సుబుద్ధి ఒప్పుకోలేదు. చివరకు చంద్రవర్మ సుబుద్ధిని రాజుగా ఆజ్ఞాపించి, తన దుస్తులు ధరింపజేశాడు. తాను సుబుద్ధి దుస్తులు ధరించి, అతనిలాగే గోడనానుకుని కూర్చున్నాడు. తరవాత సుబుద్ధి బయటికి

వెళ్లిపోయాడు. పహరావాడు వచ్చి గోడ నానుకుని కూర్చుని ఉన్న రాజకుమారుణ్ణి చూసి ఏమీ అనుమానించకుండానే తలుపు తాళం పెట్టేశాడు.

మర్నాడే శూరవర్మ వివాహం. వివాహానికి ముందు వినోదాలకు ఏర్పాట్లు చేశారు. ఖైదీకీ సింహానికీ యుద్ధం ఏర్పాటయింది. దర్బారులో మధ్యగా ఒక ఎత్తయిన అలవ ఏర్పాటుచేశారు. అందులోకి ఒక సింహాన్ని తెచ్చి వదిలారు. ఎత్తుగా సింహాసనంమీద శూరవర్మా, ఆయనకు అటూ ఇటూ రణజితమహారాజూ, ఆయన కుమార్తె ఊర్మిళా దేవీ, రెండు దేశాల అధికారులూ కూచున్నారు. అలవచుట్టూ సైనికులు, సామాన్య జనం నిలబడ్డారు.

తరవాత చంద్రవర్మను ఖైదునుంచి తెచ్చి, అతనికి ఒక కత్తీ, డాలూ ఇచ్చి అలవలోకి తోశారు. అతని జుట్టు చెదిరి ఉన్నది. ఖైదీ దుస్తులలో అతనిని చంద్రవర్మ అని ఎవరూ పోల్చలేదు. శూరవర్మ కూడా, అతను సుబుద్ధి అనే అనుకున్నాడు.

సింహం మొదట్లో చంద్రవర్మకేసి చూసి ఏమీ పట్టించుకోనట్టుగా ముఖం పక్కకు తిప్పుకున్నది. దాన్ని భయపెట్టి రెచ్చగొట్టటానికిగాను శూరవర్మ దాని సమీపంలో



గట్టిగా బాకాలు ఊదించాడు. ఆ చప్పుడుకు సింహం జూలు విదిలించి ఒక్క దూకున వెళ్లి చంద్రవర్మమీద పడింది. అతను డాలు అడ్డంపెట్టుకుని పక్కకుదూకాడు, కాని కత్తితో సింహాన్ని అందుకోలేక పోయాడు. సింహానికిప్పుడు కోపం బాగా రెచ్చిపోయింది. అది భయంకరంగా గాండ్రిస్తూ ఇంకొకసారి అతనిమీదికి పంజా లెత్తి లేచింది. ఈసారి దాని కాళ్లకు కత్తి దెబ్బ తగిలింది.

ఈ భయంకరమైన పోరాటాన్ని చూడలేక ఊర్మిళాదేవి చేతితో కళ్లు మూసుకున్నది. ఒక్క శూరవర్మ మినహాగా ఈ

పోరాటం ఇంకెవర్నీ ఉత్సాహపరచలేదు. ఖైదీ ఎంతో యుక్తిగా సింహంతో పోరాడుతూండటం అతను గమనించాడు. కాని సింహం ఎప్పుడు ఖైదీని జయిస్తుందా అని ఆత్రంగా చూస్తున్నాడు.

సరిగా ఈ సమయంలో సుబుద్ధి అక్కడికి రొప్పుకుంటూ పరిగెత్తివచ్చి, "మహారాజా! చంద్రవర్మను కాపాడండి! ఆ సింహం అతన్ని చంపేస్తుంది!" అన్నాడు.

శూరవర్మ సుబుద్ధికేసి చూసి గుర్తించాడు. అయితే ఆ సింహంతో పోరాడేది సుబుద్ధి కాదన్నమాట! ఆయనకు మతిపోయినట్టయింది. "నా కొడుకు! సింహం చంపేస్తుంది! రక్షించండి!" అని శూరవర్మ కేకలు పెట్టసాగాడు.

సింహంతో పోరాడేవాడు చంద్రవర్మ అని వినగానే ఊర్మిళ మొదలు నరికిన అరటిచెట్టులాగా పడిపోయింది. చుట్టూ చేరిన జనంలో హాహాకారాలు చెలరేగాయి.

సింహంకూడా ఈ గోలకు బాగా దడుచుకున్నది. అంతవరకూ అవకాశంకోసం చూస్తున్న చంద్రవర్మ దాని గుండెలో కత్తి దిగవేశాడు. భీకరంగా అరుస్తూ సింహం పడిపోయి ప్రాణం వదిలింది.

శూరవర్మలో పెద్దమార్పు వచ్చేసింది. ఆయన తన కొడుకును కౌగిలించుకుని ఆడదానిలాగా ఏడిచాడు. ఎందరినో పులులూ, సింహాలూ చంపగా చూసి ఆనందించాడుగాని, తన కొడుకునే సింహం చంపబోవటం చూసి ఆనందించానన్న బాధ ఆయన మనసులోనుంచి జీవితాంతందాకా పోలేదు. ఆయన తిరిగి తన జన్మలో ఎన్నడూ యుద్ధం చెయ్యలేదు, మనుషులను క్రూరమృగాలకు వెయ్యలేదు.

చంద్రవర్మకూ ఊర్మిళకూ యథావిధిగా వివాహం జరిగింది. అతను పాటలీపుత్రానికీ జయంతదేశానికీకూడా రాజై చాలాకాలం పరిపాలించాడు.





# మిత్రభేదం

కలదు పూర్వమ్మొక్క - గ్రామ, మందునను
కలడొక వడ్రంగి - కలడొక్క సాలె.
వారు బాల్యమునుండి - వరుసగా విడని
మారని మిత్రులై - మసలుచు నుండ్రు.
ఒకసారి అ యూరి - ఒక దేవళమున
నొక యుత్సవము వచ్చె, - నూరెల్ల కదిలె.
అటకు వచ్చిరి దేశ-మంతటి నుండి
నటులు నర్తకులు గా-న ప్రవీణులును.
తిరణాల జనములో - తిరుగగా వారు
మురియుచు వచ్చిరి - ముఖ్యాప్తులగుట.
అటునిటు తిరుగుచు-న్నట్టి వారలకు
తటుకున నొక రాజ-తనయ గన్పించె.
తరుణి సుందరి దేవ-దర్శనమ్మునకు
పరిజనుల్ వెన్వెంట - వచ్చుచు నుంఢ
ఆడు యేనుగు నెక్కి - అ రాకుమారి
అడ గన్పించిన - నా సాలె వలచె.
కను గొన్న యంతనే - కన్నె ప్రేమించి
మినుమిక్కిలిగ దుఃఖ-మున మూర్ఛపోయె.
నేస్తుడు, వాని నిం-టికి గొని వచ్చి
మస్తుగా పరిచర్య - మఱిమఱి జేసి
తెలివి రాగా సాలె - తిలకించి, ఏల
కలగిపోతి వటంచు - కారణ మడిగె.
"ఎందుకు లేవోయి - ఏమి చెప్పుదును?
బొందెలో ప్రాణముల్ - పోవుటే మేలు."
అను సాలెజూచి "ఏ-లయ్యా యీ దిగులు
వినిపించు మిక నీదు - వేదనల్ దీర్తు."
అనుచు వడ్రంగి అ-త్యంతాదరమున
వినిపింపమని కోర-గని సాలె యనెను.
"ఏనుగు నెక్కి క-న్పించిన కన్నె
మానసమ్మున నిల్చె - మందేమి కలదు?
రారాజు కూతు రా - రంగుల బరిణె
నారాత యిట్లుండె - నన్నీడుమయ్యా.
ఆ కన్య చూచుటే - అలవికాదింక
ఏకై పడిని పెండ్లి - యెట్లగునింక?"
ఇంతమాత్రమునకే - యీ దుఃఖమేల
ఇంతి గూర్తునటంచు - నిట్లనె వాడు.

విద్వాన్ విశ్వం



"పోతుటీగను లోన - బోనీయనట్టి
ఆ తన్వి అంతఃపు-రాంతర స్థలికి
నీవు బోవు నుపాయ-నియతి నే గూర్తు.
భావుకునకు కాని-పని యేమి కలదు ?"
అని రథకారు డా-తనికి వేవేగ
పనివాడు గనుక ఆ-యన చేసి యిచ్చె
గరుడవాహనము, శం-ఖము, చక్ర గదలు,
వరకిరీటమ్మును - త్వర త్వరగాను.
సాలెవానిని వాని - సాయమ్ముతోడ
లీలగా విష్ణుని-బోలె చిత్రించె.
కీలున్న గరుడుని - లీలలు దెలిపె,
కీలుదిప్పిన పోవు-కిటుకులు దెల్పె.
సరి మేలు మేలని - సాలెవిష్ణుండు
మరి మరి మిత్రుని - మన్ననచేసె.

కీలు పక్షిని యెక్కి - కేళికావనిని
బాల బంగరు మేడ-పై దిగినిల్చి
ఆ రాత్రియే రాజు - నేనుగు కూతురిని
చేరి తా విష్ణువై - చేరి యిట్లనియె.
" కాంత నే లక్ష్మని-కాలను ద్రోసి
ఇంత దూరము నిన్ వ-రించి వచ్చితిని."

రాజకన్య :

స్వామి నే నెక్కడ - సామాన్యురాల ?
ఈ మూడు లోకాల - కేలిక మీరు !

సాలె :

తరుణి ! పూర్వము రాధ-తన్వివి నీవు
నరలోకమున బుట్టి-నా విపు డంతె.

రాజకన్య :

అయిన మా తండ్రినే - అడుగుడో స్వామి
పయనమయ్యెద వారి - పను పైన నిపుడె.

సాలె :

"మానవులకు నేను - మఱి కంటబడను
మానిని గాంధర్వ-మహిత మార్గమున
నన్ను బెండ్లాడు, మీ-నాన్న యెందులకు?
మిన్నక వినకున్న - మీ తండ్రి నిపుడె
భస్మమ్ము సేతు శా-పము వెట్టిపోదు
విస్మయ పడనేల - వెలది రా రమ్ము."
అని సాలె బాలిక - మనసును మార్చి
తనదాని జేసుక - తన్మయుడయ్యె.

అది మొదల్ ప్రతిరాత్రి - యా వేషమునవె
సుదతి జేరుచునుండె - సుఖపడుచుండె
తెల్లవారకముందె - తిరిగి తానేమొ
చల్లగా యింటికి - జారుచునుండె.
కొన్నిరోజులలోనె - కన్నె చిన్నెలను
కన్నుల జూచిరి - కంచుకు లెల్ల.
గుసగుసవోయిరి - గుంపుగా పోయి
అసలుసంగతి చెప్పి-నారు రాజునకు.
ఈ విధమ్మెఱిగించె - దేవికి రాజు
ఆవిడ కూతుపై - నాగ్రహపడియె.
"నా తప్పు లేదమ్మ - నారాయణుండె
రాత్రైనంతనే - రయమున వచ్చు.
గాంధర్వమున నన్ను - గైకొన్నవాడు
అంధురాలనుగా న-నంతు డాతండు."
అని రాకుమారి చె-ప్పిన రాజు, రాణి
కనుగొని రా రాత్రి - కనపడకుండ
గరుడవాహన మెక్కి - మురహరుడంత
కరమున శంఖ చ-క్రమ్ముల దాల్చి
కూతుమేడను దిగు-రీతిని జూచి
మా తపఃఫలమని - మఱి యూరకొనిరి.
ఉబ్బి తబ్బిబ్బయ్యె - ఉర్వీశుడంత
అబ్బ విష్ణుడె నాకు - అల్లుడైనాడు
కొల్లగా నామాట - చెల్లునటంచు
మెల్లగా నెల్లలు - మేఱలు దాటె.



పొరుగు రాజ్యమ్ముల-పూర్వసీమలను
చరచర దాటి ర-చ్చలు దెచ్చుకొనియె.
ఎత్తివచ్చిరి రాజు - లిడియేమి అనుచు
అత్తఱి కూతుని - నర్థించె రాజు:
"అల్లుని కొకమాట - మెల్లగా చెప్పు
చిల్లరరాజుల - అల్లరి బలిసె
నారాయణుని రాణి - నా కూతురింక
ఈరీతి అవమాన-మే నందనేల ?"
ఆ రాత్రి మాయ నా-రాయణమూర్తి
చేరిన రాజకు-మారి ప్రార్థించె.
"స్వామి మీరుండి మా-జనకుడు, శత్రు
భూమీశులకు చిక్కు-టేమి న్యాయమ్ము?
మా నాన్న కాపాడి - మమ్మేలు" మన్న
తాను దేవునియట్లు - తలయూపె వాడు.

# అశరీరవాణి హెచ్చరిక

విసుకు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని దించి భుజం మీద వేసుకుని, ఇంకొకసారి శ్మశానంకేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు బిగ్గరిగా నవ్వి, "రాజా, నీవు ఇంత ప్రయాసపడుతున్నప్పటికీ జరగబోయేదాన్ని మార్చే శక్తి నీకు కొంచెమైనా లేదు. ఆ సంగతి గ్రహించలేక పూర్వం కుణాళుడనే యువకుడు ప్రాణాన్ని సయితం పోగొట్టుకున్నాడు. అతని కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్ప సాగాడు:

పూర్వం ఒక గ్రామంలో కుణాళుడనే యువకుడుండేవాడు. వాడు ఎంతో భూతదయ కలవాడు, ఎప్పుడూ ఆనందంగా ఉండేవాడు. వాడు రాచనగరుకు వెళ్లి ఏదైనా ఉద్యోగం చేసుకుందామనే ఉద్దేశంతో ఒకనాడు యింటి నుంచి బయలుదేరాడు.

## బేతాళ కథలు



కుణాళుడు తన యింటినుంచి పడమరగా కొంత దూరం వెళ్లితే ఒక అడవి వస్తుంది. ఆ అడవి దాటితే పచ్చికబీళ్లు వస్తాయి. అవి దాటితే ఒక కొండ వస్తుంది. ఆ కొండకు పడమరగా రాచనగరున్నది.

కుణాళుడు అడవి చేరేసరికి మిట్ట మధ్యాహ్నమయింది. అడవిలో నీడగా చల్లగా ఉంటుంది. ఎండవేడి తగ్గేదాకా ఆడుతూ పాడుతూ అడవిలోనే నడిచే ఉద్దేశంతో కుణాళుడు అడవిలోకి ప్రవేశించబోయాడు.

సరిగా ఆ సమయానికి ఒక గంభీరమైన కంఠం, "కుణాలా! అడవిలో ప్రవేశించవద్దు! హత్య చెయ్యగలవు!" అని హెచ్చరించింది. ఆ శబ్దం ఎటునుంచి వచ్చిందో, ఎంత దూరంనుంచి వచ్చిందో వాడు తెలుసుకోలేకపోయాడు. మొదట, తనతో ఎవరో పరాచకాలాడుతున్నారనుకుని చెట్లవెనక చూశాడు. ఎక్కడా ఎవరూ కనిపించ లేదు.

ముందుకు పోదామనే ఉత్సాహంలో కుణాళుడు ఈ హెచ్చరికను పాటించలేదు. వాడు అడవి ప్రవేశించి చెట్ల నీడను నడవసాగాడు. ఎంతో మెత్తని స్వభావం కలవాడు గనక ఇంకొకరిని చంపవలిసి వస్తుందేమో



నని వాడు చాలాబాధపడ్డాడు. కాని అడవిలో ఎవరూ తగలలేదు. ఏమీ జరగకుండానే వాడు అడవి అవతలివేపు చేరాడు.

ఇంకా ఎండ జాస్తిగానే ఉంది. నిష్కారణంగా భయపడినందుకు తనలో తాను నవ్వుకుని కుణాళుడు అడవి చివర చెట్ల నీడను కాస్సేపు నిద్రపోయి, ఎండ మీద పడగానే లేచాడు. బీడు దాటి, కొండ ఎక్కి దిగవలసి ఉంది. అందుచేత వాడు అడవి నుంచి ముందుకు కదిలాడు.

పూర్వంలాగే మళ్లీ కంఠం వినిపించింది:

"కుణాలా! బీడుమీదికి వెళ్లకు! దేశానికి అరిష్టం తేగలవు!"



"ఎవరు నువు? నన్నెందుకిలా బెదిరిస్తావు? నీమాట నేను నమ్మను. అడవిలో ప్రవేశిస్తే హత్య చేస్తానన్నావు? నే నెవరినీ హత్య చేయలేదు," అన్నాడు కుణాళుడు.

"హత్యచేశావు. నీకు తెలియదేమో; నీ పాదంకింద బడి ఒక పురుగు చచ్చిపోయింది!" అన్నది కంఠం.

"దానికి నేనేం చెయ్యగలను? అటువంటి పొరపాటు ఎవరివల్లనైనా జరగవచ్చు. ఈ బీడుమీద ప్రవేశించినంత మాత్రాన నేను దేశానికి అరిష్టం తెస్తాననటం పచ్చి అబద్ధం!" అంటూ కుణాళుడు ముందుకు నడక సాగించాడు.

వాడు కొండను చేరుకునేసరికి పొద్దూకిపోయింది. కాని కొండ అవతల పగటి వెలుతురు ఇంకా ఎక్కువ సేపుంటుందని వాడికి తెలుసు. అందుచేత వాడు కొండ ఎక్క నారంభించాడు. మళ్ళా అదే కంఠం గంభీరంగా పలికింది:

"కుణాలా! కొండ ఎక్కకు! చచ్చిపోగలవు!"

కుణాళుడికి మండిపోయింది. "నన్నెందుకిలా భయపెడుతున్నావు? నీకు నేనంటే వేళాకోళంగా ఉందా? బీడు దాటాను. దేశానికి అరిష్టం తెస్తానన్నావు. తెచ్చానా?" అని వాడు కేకపెట్టాడు.

"తెచ్చావు! నీవు బీడు దాటే సమయాన కొన్ని సీతాకోకచిలకలను బెదరగొట్టావు. అందులో ఒకటి చాలా బెదిరింది. అది రాచనగరుదాకా వెళ్ళి అక్కడి చెట్లమీద గుడ్లు పెడుతుంది. అవి పొదిగితే వచ్చే అకు పురుగుల్లో ఒకటి గర్భవతిగా ఉన్న రాణీగారి మెడమీద పాకుతుంది. వెంటనే రాణి కెవ్వున కేకవేసి పడిపోతుంది. ఆమె గర్భంకాస్తా పోతుంది. రాజుగారికి మరి సంతానం కలగదు. అందుచేత, రాజుగారి తమ్ముడు రాజవుతాడు. వాడు పరమ దుర్మార్గుడై రాజ్యాన్ని అరాజకం చేసి

చివరకు శత్రువుల చేతుల్లో పెడతాడు. ఈ జరగబోయే అనర్థానికి నువ్వే కారకుడివి!" అని ఆ కంఠం జవాబిచ్చింది.

"ప్రతి సంఘటనకూ ఏదో ఒక ఫలితం ఉండకుండా ఉంటుందా? ఎప్పుడో జరగబోయేదానికి నేను బాధ్యుణ్ణని ఒప్పుకోను!" అంటూ కుణాళుడు కొండ ఎక్కసాగాడు. అతను కొండశిఖరం చేరేసరికి పడమట ఇంకా అస్తమయ కాంతి ఉన్నది.

కుణాళుడు విజయ గర్వంతో, "ఇప్పుడేం చెబుతావు? కొండ ఎక్కాను, కాని ఇంకా బతికే ఉన్నాను! నీ మాటలన్నీ అబద్ధాలు!" అన్నాడు నవ్వుతూ.



"పిచ్చివాడా, నీతో అబద్ధం చెప్పవలిసిన అవసరం నాకు లేదు. కొండ ఎక్కినవాడు దిగాలి గద! ప్రాణాలుండగా నువు ఇంకె పరినీ చూడబోవు! నిన్నెవరూ ప్రాణాలతో చూడబోరు!" అన్నది కంఠం.

కుణాళుడు ఈసారి బెదిరిపోయాడు. కమ్ముకువచ్చే చీకటిలో కొండ దిగడం వాడికి ప్రమాదమని పించింది. తెల్లవారే దాకా కొండమీదనే ఉందామనుకున్నాడు. కాని కొంచెం ఆలోచించాక భయపడటం అనవసరమని వాడికి తోచింది. ఎందుకంటే, వాడితో మాట్లాడిన ఆ కంఠం అశరీరవాణిది. అయితే అది జరగబోయే సంగతి తెలిసి మాట్లాడుతున్నది. అప్పుడు తనకు చావు తప్పదు. అలాటప్పుడు చావుకోసం తాను తెల్లవారిందాకా కాచుకుని ఉండనవసరం లేదు. అశరీరవాణి భవిష్యత్తు తెలియక మాట్లాడుతున్నట్టయితే అది చేసే హెచ్చరికను పాటించనవసరంలేదు.

ఇలా అనుకుని కుణాళుడు చీకటిలోనే కొండదిగ నారంభించి, ఒకచోట కాలు జారి చాలా లోతున పడి చనిపోయాడు. తరవాత కొద్దికాలానికి, అశరీరవాణి చెప్పినట్టె, రాణిగారి మెడమీద అకుపురుగు పాకటమూ, ఆమె మూర్ఛపోవటమూ, గర్భ

ప్రాపం కావటమూ, రాజుగారికి మరి పిల్లలు కలగక రాజ్యం రాజుగారి తమ్ముడికి చెందటమూ, వాడు దుర్మార్గుడై అరాజకం కలిగించటమూ, రాజ్యం కాలక్రమాన శత్రువుల పాలు కావటమూ జరిగాయి.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం కలిగింది. అశరీరవాణి చేసిన హెచ్చరికలు పాటించకపోవటంలో కుణాళుడు తప్పు చేశాడా, లేదా? అతనికి హత్య చేసిన పాపమూ, రాజ్యానికి విపత్తు కలిగించిన పాపమూ, ఆత్మహత్య చేసుకున్న పాపమూ అంటుతాయా, అంటవా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"కుణాళుడు తప్పు చేయలేదు. అతనికి ఏ పాపమూ అంటదు. అశరీరవాణికి భవిష్యత్తు తెలుసునే గాని దానిని మార్చే శక్తి ఎంతమాత్రమూ లేదు. ఉన్నపక్షంలో అది కుణాళుడికి హెచ్చరికలు చేయటమే కాకుండా, భవిష్యత్తునుకూడా సకాలంలో తెలిపి ఉండేది. తాను అడవిలో ప్రవేశించి నందువల్ల ఒక చిన్న పురుగు చచ్చి పోతుందని ముందుగా తెలిసినా, కుణాళుడు వెనక్కు తిరిగి పోయి ఉండేవాడే. కాని కుణాళుడు అడవి ప్రవేశించకుండా, బీడు దాటకుండా, కొండ ఎక్కకుండా చేసే శక్తి అశరీరవాణికి లేనట్టు స్పష్టమవుతున్నది. అటువంటప్పుడు మానవమాత్రుడైన కుణాళుడికి పురుగును చంపకుండా, రాజ్యానికి అరిష్టం రాకుండా, తాను చావకుండా అపగల శక్తి ఉన్నదని ఎవరనగలరు? అశరీరవాణిలాగా అతనికి భవిష్యత్తుకూడా తెలియదే! అందువల్ల ఏ విధంగా చూచినా కుణాళుడు పూర్తిగా నిర్దోషి!" అని విక్రమార్కుడు జవాబిచ్చాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






4

[మోహనుడు తీసుకుపోయిన భువనసుందరిని మంచిగా తిరిగి తెచ్చుకోవటానికి గ్రీకులు చేసిన యత్నం విఫలమయింది. ట్రాయ్ నగరంపై దాడి వెడలటానికి తనకు సాయం రమ్మని భువనసుందరి భర్త ప్రతాపుడు గ్రీకు రాజకుమారుల నందరినీ కోరాడు. అతి కష్టంమీద గ్రీకు సైన్యం నౌకలలో ఆయుత్తపరచబడ్డాయి. రూపధరుడు పిచ్చి నటించాడు. వజ్రకాయుడు ఆడవేషంతో ఒక రాజాంతఃపురంలో దాగాడు. అయినప్పటికీ వీరందరి తోనూ చేరి గ్రీకు బలాలు ఆయుత్తమై కాలక్రమాన ట్రాయ్ తీరాన్ని చేరుకున్నాయి.]

గ్రీకు నౌకలలోనుంచి తీరానికి దూకిన మొదటివాడు చంద్రప్రభుడైతే, రెండవ వాడు వజ్రకాయుడు. అతని వెనకనే గ్రీకు బలాలన్నీ దిగి సమరానికి తలపడ్డాయి.

ట్రోజనులలో మరాళుడని ఒక వీరు డున్నాడు. అతను కత్తితోగాని, బల్లెంతోగాని చావడు. ఈ మరాళుడు ఆ తొలిరోజు యుద్ధంలో అనేకవందలమంది గ్రీకు యోధులను యమపురానికి పంపాడు. వజ్రకాయుడు మరాళుణ్ణి ఎదిరించి పోరు సాగించాడు, కాని ఎంత సేపు పోరినా అతను లొంగలేదు. ఆఖరుకు మరాళుడు ఒకరాయి తగిలి పడిపోగానే వజ్రకాయుడు అతని రొమ్ముమీద మోకాళ్లు మోపి కూచుని, అతన్ని గొంతు పిసికి చంపేశాడు.

మరాళుడు చావగానే ట్రోజను సేనలు బెదిరి, చెదిరి, వెన్నిచ్చి ట్రాయ్ నగరానికి పారిపోయాయి. ఆ తరువాత గ్రీకులు తమ



నావలను సముద్ర తీరాన ఒక సురక్షిత ప్రాంతాన ఉంచి, ట్రోయ్ నగరపు గోడల బయట ముట్టడివేశారు. ఈ ముట్టడి పదేళ్లు సాగింది. మొదటి తొమ్మిది సంవత్సరాల కాలంలో ఉభయపక్షాలకూ మధ్య చెప్పుకోదగిన యుద్ధం ఏమీ జరగలేదుగాని అనేక ఇతర సంఘటనలు జరిగాయి.

ట్రోయ్ రాజైన వర్ధనుడికి ఇద్దరు భార్యలు. మోహనుడి తల్లి ఆయనకు రెండవ భార్య. ఆయనకు కలిగిన యాభై మంది కుమారులలో 19 మంది ఆమె కన్న బిడ్డలే. వారందరిలోకీ జ్యేష్ఠుడు వీరసింహుడు. ఆమెకు కలిగిన కుమారులలో ఇలియుడు ఒకడు. ఇలియుడికి ఇరవై ఏళ్లు నిండినట్లయితే ట్రోయ్ నగరాన్ని ఎవరూ జయించలేరని దైవజ్ఞులు చెప్పారు.

అందుచేత ఎలాగైనా ఇలియుణ్ణి కడతేర్చటానికి వజ్రకాయుడు పూనుకున్నాడు. ఒకనాడు ఇలియుడు ఒక ఆలయప్రాంగణంలో తన గుర్రాలను కవాతు చేయిస్తుండగా వజ్రకాయుడు అక్కడికి వెళ్లి, ఇలియుణ్ణి బల్లెంతో పొడిచి చంపేశాడు. ఇలియుడి మృతికి ట్రోయ్ పౌరులందరూ దుఃఖించారు.

వర్ధనుడి కొడుకులలో వృకాక్షుడని మరొక డున్నాడు. వాడు తోటలో కొమ్మలు

నరికి, రథాలకు పనికివచ్చే కాడి కర్రలు తయారుచేస్తూ ఉండగా, రాత్రివేళ వజ్రకాయుడు రహస్యంగా నగరంలోకి ప్రవేశించి వృకాక్షుడు పని చేసుకుంటూ ఉండిన తోటకు వెళ్ళి, అతనిని పట్టుకుని తమ శిబిరానికి తీసుకుపోయాడు.

ఈ ఖైదీని గ్రీకు నాయకులు, ఏం చెయ్యాలో తెలియక, తమ సైన్యాలకు సారా సరఫరాచేసే ఒక రాజుకు బానిసగా అమ్మారు. ఆ రాజు కొలువులో ఉండే వారెవరో వృకాక్షుణ్ణిచూసి జాలిపడి, రాజుకు తగిన సొమ్మిచ్చి, అతన్ని బానిసత్వంనుంచి విముక్తుణ్ణిచేశారు. వృకాక్షుడు ట్రోయ్ నగరానికి తిరిగివస్తూ ఉండగా, దారిలో అతన్ని చూసి వజ్రకాయుడు చంపేశాడు.

వజ్రకాయుడు ఇలాటి పనులింకా చేశాడు. యుద్ధం లేదు, గ్రీకు సైనికులకు పని కూడా లేదు. అందుచేత వజ్రకాయుడు ఒక సైనిక దళాన్ని వెంటబెట్టుకుని ట్రోయ్ నగరపు పరిసరాలు కొల్లగొట్ట నారంభించాడు. వారు ఐడా పర్వతంమీదికి వెళ్లేసరికి అక్కడ వారికి ప్రశంసనుడు అనేవాడు తటస్థపడ్డాడు.

ఈ ప్రశంసనుడు మోహనుడికి దాయాది మోహనుడు భువనసుందరిని ఎత్తుకురావటానికి స్పార్టాకు వెళ్ళినప్పుడు ప్రశంసనుడు





కూడా అతనివెంట వెళ్లి అనేక విధాల సాయపడ్డాడు. అయినప్పటికీ, భువనసుందరి మూలంగా గ్రీకులకూ, ట్రోజనులకూ కలిగిన యుద్ధంలో ప్రశంసనుడు తటస్థంగా ఉండిపోయాడు; అతను యుద్ధం చెయ్యలేదు సరికదా, అతని బలాలుకూడా యుద్ధంలోకి రాలేదు.

ప్రశంసనుడు తన పశువుల మందలను కాసే వారివెంట ఐడా పర్వతంమీద ఉన్న సమయంలో వజ్రకాయుడూ అతని సైనికులూ అక్కడికి వచ్చారు. వజ్రకాయుడి ధాటికి తాళలేక ప్రశంసనుడు కొండ దిగి పారిపోయాడు. గ్రీకులు ప్రశంసనుడి పసుల



కాపర్లను హతమార్చి పశువుల మందలను స్వాధీనపరుచుకున్నారు.

ఈ సంఘటన జరిగినాక ప్రశంసనుడు తటస్థంగా ఉండలేక పోయాడు. అతను వెంటనే తన బలాలను ట్రాయ్ నగరానికి తరలించుకు వెళ్లి, యుద్ధంలో చేరాడు. ప్రశంసనుడు గొప్ప యోధుడు. ఎవరినీ లక్ష్యపెట్టని వజ్రకాయుడు సహితం అతన్ని గురించి ఎన్నడూ తేలికగా మాట్లాడలేదు. ఇక ట్రోజను సైనికుల మాట చెప్ప నవసరం లేదు. వారు తమ పక్షాన గల వీరులలో వీరసింహుణ్ణి ఎంతగా గౌరవించేవారో ప్రశంసనుణ్ణి కూడా అంతగానూ గౌరవించేవారు. యుద్ధంలో అతను అనేకసార్లు బాగా గాయపడ్డాడు, కాని ప్రతిసారీ ప్రాణాలతో బయటపడ్డాడు.

ఈ యుద్ధంలో ప్రశంసనుడికి చావు రాసి పెట్టిలేదు. అతని వంశంవాళ్లు ముందు ముందు ట్రాయ్ నగరానికి రాజులు కావాలని రాసిపెట్టి ఉంది.

ట్రాయ్ నగరంతో సఖ్యత గల నగరాలు ఇంకా అనేకం ఉన్నాయి. వాటిలో చాలా వాటిని వజ్రకాయుడు ఓడించి వశపరుచుకున్నాడు. అతనికి లోబడిన నగరాలలో ఒకదానికి రాజు వీరసింహుడికి పిల్లనిచ్చిన





మామ. గ్రీకులతో జరిగిన పోరాటంలో ఈ రాజూ, ఆయన కుమారులు ఏడుగురూ మరణించారు.

గ్రీకు శిబిరంలోనే కొన్ని దారుణ సంఘటనలు జరిగాయి; అందులో ఒకటి—

ఒకప్పుడు రారాజు రూపధరుణ్ణి పిలిచి, "నీవు త్రేస్‌కు వెళ్లి నౌకలో ధాన్యం పట్టించుకుని రా!" అని ఆజ్ఞాపించాడు. రూపధరుడు ఆ ప్రకారమే వెళ్లి, ధాన్యం తీసుకు రావటానికి మారుగా ఉత్త చేతులతో తిరిగి వచ్చాడు.

గ్రీకు వీరులలో ఒకడైన ప్రబోధుడు రూపధరుడితో, "నీవు వట్టి సోమరిపోతువు! పిరికి పందవు!" అన్నాడు.

"నా తప్పేమీ లేదు. ఎక్కడా ధాన్యం దొరక లేదు. రారాజు నిన్ను పంపి ఉన్నా వట్టిచేతులతో వచ్చిఉండేవాడివే!" అన్నాడు రూపధరుడు.

ప్రబోధుడికి పంతం వచ్చింది. అతను అప్పటికప్పుడే ఒక నావను తరలించుకుని వెళ్లి, దాని నిండా ధాన్యం తీసుకుని తిరిగి వచ్చాడు. రూపధరుడికి తీరని పరాభవం జరిగింది. ప్రబోధుడిపైన ఎలా పగ తీర్చుకోవటమా అని అహోరాత్రాలు మధనపడి, చివరకొక పన్నాగం ఆలోచించాడు.




ఒకనాడు రూపధరుడు రారాజుకు ఈ విధంగా వార్త పంపాడు;

"రాత్రి కలలో నాకు దేవతలు కనబడి మన శిబిరంలో ఒక గొప్ప ద్రోహం జరగనున్నదని హెచ్చరించారు. ప్రమాదం తప్పాలంటే ఒక పగలూ, రాత్రీ మనం శిబిరం మార్చాలి!"

రూపధరుడు చేసిన ఈ సూచనను రారాజు వెంటనే అమలు జరిపించాడు. గ్రీకులందరూ తమ శిబిరాన్ని వదిలేసి ఒక పగలూ, రాత్రీ మరొక చోట గడిపారు. శిబిరం ఖాళీ అయిన సమయంలో రూపధరుడు రహస్యంగా ప్రబోధుడి గుడారం





ప్రవేశించి అక్కడ ఒక బంగారు నాణాల సంచీని దాచాడు.

తరవాత అతను యుద్ధఖైదీని ఒకణ్ణి పట్టుకుని వాడిచేత బలాత్కారంగా ఒక ఉత్తరం రాయించాడు. ఆ ఉత్తరం వర్ధనుడు ప్రబోధుడికి రాసినట్టుగా ఉన్నది. "గ్రీకులకు ద్రోహంచెయ్యటం నిమిత్తమై నీవు కోరినప్రకారం బంగారం పంపడమైనది", అని ఆ ఉత్తరంలో ఉంది.

"నువు వెంటనే ఈ ఉత్తరం తీసుకుపోయి ప్రబోధుడికి అందజెయ్యి!" అని యుద్ధఖైదీకి రూపధరుడు చెప్పాడు. కాని ఖైదీ ఆ ఉత్తరాన్ని ప్రబోధుడికి అందించ



బోయే దారిలో రూపధరుడు అతన్ని తన మనుషులచేత చంపించాడు.

మర్నాడు తెల్లవారి గ్రీకులు తమ పాత శిబిరానికి తిరిగివచ్చేటప్పుడు శిబిరం వెలపల చచ్చిపడిఉన్న యుద్ధఖైదీ కనిపించాడు. అతనివద్దఉన్న ఉత్తరం వారికి దొరికింది. అది చాలా ప్రమాదకరమైన ఉత్తరంగా కనపడ్డందున దానిని వెంటనే రారాజుకు చేర్చారు.

రారాజు ఆ ఉత్తరాన్ని చూసుకుని ప్రబోధుణ్ణి విచారణకు పిలిచాడు. వర్ధనుడి నుంచి అలాటి ఉత్తరం రావటానికి సంజాయిషీ చెప్పమన్నాడు. తాను దేశద్రోహిని కాననీ, తనకు వర్ధనుడుగాని, మరొకరుగాని ఎన్నడూ బంగారం ఇచ్చి ఉండలేదని ప్రబోధుడు చెప్పాడు.

"అతని గుడారం వెతికితే నిజం తెలిసిపోతుంది!" అన్నాడు రూపధరుడు.

గుడారం వెతికారు. బంగారం దొరికింది. ప్రబోధుడు ద్రోహిగా నిర్ణయించబడ్డాడు. అటువంటి ద్రోహికి శిక్ష ఏమిటంటే సైనికులందరూ అతన్ని రాళ్లతో కొట్టి చంపటం. ప్రబోధుణ్ణి అదేప్రకారం గ్రీకులందరూ రాళ్లతో కొట్టి చంపారు. చనిపోయే ముందు ప్రబోధుడు, "అయ్యో!



సత్యమా ? నా కన్నముందే నీవు చని పోయావా ?" అని ఆక్రోశించాడు.

ప్రబోధుడి హత్య అన్నివిధాలా అక్రమ మైనది. అతను నిర్దోషి కావటమే గాక గొప్ప ప్రతిభావంతుడుకూడా. ట్రోయ్ నగరాన్ని ముట్టడించిన గ్రీకులకు కాలక్షేపం జరగ టానికిగాను అతను పాచికలు సృష్టించాడు. అతను సృష్టించినవి ఇంకా చాలా ఉన్నాయి. అతను దీపస్తంభాలు కని పెట్టాడు; త్రాసులూ, కొలమానాలూ సృష్టిం చాడు ; లిపిని సృష్టిచేశాడు; సైనిక శిబిరాల లోనూ, ఇతర చోట్లా పహరావాళ్లను ఏర్పాటు చేసే వైనం కనిపెట్టాడు. గ్రీకులు అతనికి ఎన్నోవిధాల ఋణపడి ఉన్నారు.

గ్రీసుదేశంలోఉన్న ప్రబోధుడి తండ్రికి తన కుమారుడి హత్యను గురించి వార్త తెలిసింది. ఆయన ట్రోయ్ నగరానికి ప్రయాణమై వచ్చి, "నా కొడుకును ఏ కారణంచేత హత్య చేయవలిసివచ్చింది ? వాడు ద్రోహి అని ఎలా రుజువుచేశారు ?" అని రారాజును నిలవదీసి అడిగాడు.

రారాజు ఆయనకు సంజాయిషీ ఇవ్వ నిరాకరించాడు. ప్రబోధుడు అకారణంగా హత్యచేయబడ్డాడనీ, రూపధరుడు అతని మీద కుట్రచేసి ఆ పని చేయించాడనీ రారాజుకు స్పష్టంగా తెలిసే ఉండాలి. అయినప్పటికీ ఆయన రూపధరుడిపై గల ఆదరంకొద్దీ ప్రబోధుడి తండ్రి ఆక్షేపణను తోసిపుచ్చాడు.

తాను వచ్చిన పని కాలేదు. ప్రబోధుడి తండ్రి గ్రీసుకు తిరిగివెళ్లి, కొంతమంది గ్రీకువీరుల భార్యలతో, "నీ భర్త ఎవతెనో ట్రోయ్‌నగరపు స్త్రీని పెళ్లాడి వెంటతెస్తు న్నాడు. ఇకముందు ఆవిడే రాణి కాబో తుంది!" అని అబద్ధాలు చెప్పాడు. ఇది విని కొందరు గ్రీకు స్త్రీలు ఆత్మహత్యలు చేసుకున్నారు.

(ఇంకా ఉంది)





# విచిత్రమైన వ్యాధి

చాలాకాలం కిందట ఒకానొక పల్లెలో శాయమ్మ, గంగన్న అన్న పేరుగల పేద దంపతులుండే వారు. వాళ్లకు పిల్లా జెల్లా లేరు. ఇద్దరికీ ముసలితనం సమీపిస్తోంది. గంగన్న మొదటినుంచీ ముక్కోపి. ఇక వయసు ముదురుతున్నకొద్దీ, మనిషితో టు ఆ కోపంకూడా ముదరబారుతూ న్నది. చీటికీ మాటికీ చిర్రు బుర్రు టం, అనవసరంగా కవ్వించి భార్యో మీద చెయ్యి చేసుకోవటం, కృత్యమై పోయింది.

సంతు లేదన్నది ఒక పెద్ద పాటు మొగుడు గంగన్న టం, మాటకుముందు ం మరీ బాధగా ఉంది. 'ఈ ముసలాడికి దెబ్బల రుచి ఎలా ఉంటుందో ఒక్కసారి చవిచూపిస్తే బావుండునే!' అనుకున్నది శాయమ్మ. అందుకు తగిన సమయంకోసం వేచివున్నది. ఒకనాడు ఆ సమయం రానే వచ్చింది.

ఇంతకీ పాపం, కాలంఖర్మం గంగన్నకి కలిసిరాలేదన్నమాట. పొద్దున్నే మంచం మీంచి లేస్తూనే శాయమ్మను కవ్వించి నాలుగు తన్ని అడవికి చక్కాపోయాడు. రోజూ గొడ్డలి భుజాన వేసుకుని అడవికి పోయి వోపినన్ని కట్టెలు కొట్టుకురావటం గంగన్న పని.

ఆ రోజున గంగన్న పెళ్ళాన్ని నాలుగు తన్ని అటు అడవికి వెళ్ళాడో లేదో—ఇటు జమీందారుగారి నౌకర్లు వచ్చారు. వస్తూనే శాయమ్మ వాళ్ళ యింటి తలుపు తట్టి 'ఎవరు లోపల?' అంటూ హుంకరించారు.

ఆ రోజుల్లో జమీందారుల నౌకర్ల పని అంత మిడిసిపాటుగా ఉంటూండేది. సరే, శాయమ్మ వెళ్లి తలుపు తీసింది. జమీందారుగారి నౌకర్లు ఆమెకేసి కొరకొర చూస్తూ,

ఆర్. బసవరాజు

"ఈ పల్లెలో చిట్కావైద్యం తెలిసినవాళ్ళు ఎవరైనా ఉన్నారా?" అని అడిగారు.

ఈ ప్రశ్న వినగానే శాయమ్మకు చెప్ప లేని ఆనందం కలిగింది. "ముక్కోటి దేవతల్లారా! దణ్ణాలమ్మా, దణ్ణాలు!" అను కున్నది మనసులో. తరవాత—

"చిట్కావైద్యం తెలిసినవాళ్ళు లేకేం బాబులూ? ఒకాయన ఉన్నాడు. ఆయన ఎవరో కాదు, మా ఆయనే! ఇంతకీ ఎవరికీ జబ్బు?" అని అడిగింది శాయమ్మ.

జమీందారు నౌకర్లు సంగతంతా చెప్పారు. జమీందారుగారి అమ్మాయికి జబ్బుచేసింది. ఘన వైద్యులంతా వచ్చి మందు లిచ్చినా వ్యాధి నయం కాలేదు. అందుకని యిక చిట్కావైద్యాలతో వ్యాధులు కుదిర్చేవారి కోసం వెతుకుతున్నారు వాళ్ళు.

"మా ఆయన ఎంత ఆపదలో ఉన్నవాళ్ల నైనా, తన చిట్కావైద్యంతో చటుక్కున గట్టెక్కిస్తాడు. చూడండి, మొన్నగాక మొన్న—గూని రంగన్న కొడుకు గుడి గోపురంమీంచి కింద పడి కాలు విరగకొట్టు కుంటే—మా ఆయన ఏదో యింత తైలం మర్దించాడు. ఇక ఆ వింత చూడవలసిందే నాయనలారా—ఆ కుర్రాడు ఎగిరి గంతేసి, మళ్ళీ గుడిగోపురం ఎక్కి కూచున్నాడు!"



శాయమ్మ మాటలు విన్న జమీందారు నౌకర్లకు తమ శ్రమ ఫలించిందిగదా అన్న సంతోషం కలిగింది.

"అతడెక్కడ ఉన్నాడు? ఎక్కడ! ఎక్కడ!" అంటూ వాళ్లు వేగిరపడ్డారు.

"కట్టెలు కొట్టి తెచ్చేందుకని అడవికి వెళ్ళాడు," అన్నది శాయమ్మ.

"అంత ఘరానా వైద్యుడు, కట్టెలు కొట్టుకోవటమా? వింతగా ఉందే!" అన్నారు జమీందారు నౌకర్లు.

"వింత ఏమిటి నాయనా, విచిత్రం!" అన్నది శాయమ్మ. తరవాత తలా చేతులూ అటూయిటూ ఆడిస్తూ:

"ఆయన అందరు వైద్యులవంటివాడు కాడు. ఒకోసారి అచ్చం కాపులాగా దుస్తులు వేసుకుంటాడు. వీలు చిక్కిందా తను వైద్యం చేస్తున్న రోగులదగ్గర్నుంచి మాటా మంతీ లేకుండా పారిపోతాడు. పైగా ఈ మధ్య—అసలు తనకు వైద్యం చేయటమే తెలియదంటూ వాళ్ళతోనూ వీళ్ళతోనూ అంటున్నాడు. ఇక జమీందారుగారి అమ్మాయి అదృష్టం! మీ చేతికర్రలకు బాగా పని చెప్పారంటే—తను వైద్యుణ్ణని ఒప్పుకోక ఎక్కడికి పోతాడు!" అన్నది శాయమ్మ. ఆమె చెప్పిందంతా విని జమీందారు నౌకర్లు నవ్వారు. వాళ్ళలో ఒకడు:

"నువు చెప్పిందీ నిజమే! తెలివి గల వాళ్ళని కొందరిని చూస్తున్నాంగదా! వాళ్లకి తెలివితోపాటు కాస్త తలతిక్క కూడా ఉంటుంది," అన్నాడు.

తరవాత జమీందారు నౌకర్లు అడవిలోకి పోయారు. వాళ్ళకు కట్టెలు కొడుతున్న గంగన్న కనిపించాడు.

"నువ్వేనా గంగన్నవి?" అని అడిగారు వాళ్ళు మర్యాదగా.

"అవును, కాదు!" అన్నాడు గంగన్న ముఖం చిట్లించి. "అతడితో మీకేం పనో ముందు తెలిస్తే తప్ప, అతడెవరైందీ మీకు తెలియదు!" అన్నాడు, అనుమానంగా



వాళ్ళకేసి చూస్తూ. దానికి జమీందారు నౌకర్లు: "అయ్యా! మేము మీ ఘనతను గురించి విన్నాం. మీవల్ల కావలిసిన ముఖ్యమైన పని ఒకటి వుంది!" అన్నారు.

"అలా అయితే సరి. మీరు నా ఘనతని గూర్చి విన్నదికూడా నిజమే! కట్టు గొయ్యలూ, నాగటి దుంపలూ చెక్కటంలో నేను మొనగాణ్ణి!" అన్నాడు గంగన్న.

"అంత ఘనవైద్యులు మీరు—యిలా మాట్లాడటం బాగాలేదు," అన్నారు జమీందారు నౌకర్లు.

బహుశా వీళ్లెవరో పిచ్చివాళ్లయి వుంటారు అనుకున్నాడు గంగన్న.

"వైద్యుడేమిటి? నే నెన్నడూ వైద్యం చేసి ఎరగనే!" అన్నాడు.

జమీందారు నౌకర్లు మొహమొహాలు చూసుకుని, 'ఆమెచెప్పింది నిజమే!' అనుకున్నారు. ఇంకేం—మరుక్షణంలోనే చేతి దుడ్డుకర్రలు గంగన్న వంటిమీద పడినై. కుయ్యోమొర్రో నేను వైద్యుణ్ణికాదు అంటూ గంగన్న గోలపెట్టాడు. గోల చేసినకొద్దీ దుడ్డుకర్ర దెబ్బలు అధికం కాసాగినై. చివరకి 'వైద్యుణ్ణే' అని ఒప్పుకోక తప్పింది కాదు గంగన్న. ఆతరవాత నౌకర్లు, గంగన్నను సరాసరి జమీందారు దగ్గరకు తీసుకుపోయారు. జమీందారు సంతోషంగా







"అయ్యో, అమ్మాయికి హఠాత్తుగా ఒక్కసారి మాట పడిపోయింది. వివాహ ముహూర్తం నిర్ణయించాంకూడా. అవతల మాటపోతుంది. నేను గట్టి చిక్కులో పడి పోయాను. ఇంతకీ అమ్మాయికి పట్టుకున్న వ్యాధి ఏమిటంటారు?" అన్నాడు.

"వ్యాధికేముంది, మాట పడిపోవటమే?" అన్నాడు గంగన్న.

"వ్యాధికి కారణం ఏమిటో సెలవిస్తే..." అన్నాడు జమీందారు. అందుకు గంగన్న తల పంకిస్తూ:

"కారణం ఏముంది...నాలుక పని చెయ్యటం మానేసింది! ఇందుకు గల కారణాలనుగురించి వాల్మీకి చాలా రాశాడు. ఆయన చాలా గొప్పవాడు. ఒక్క అంగుళం పాటి నాకంటె పొడవరి! మీకు సంస్కృతం వచ్చా? ఓహో రాదా! సరే యీ వ్యాధిని గూర్చిన సర్వం ఒక్క సంస్కృత పదంలో యిమిడ్చేశా డాయన. నాలుకను కదిలించే నాళాలు కొన్ని మన శరీరంలో ఉంటాయి!" అన్నాడు గంగన్న గుక్క తిప్పుకోకుండా. తరవాత శరీరశాస్త్రంమీద తాపీగా చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

జమీందారు అంతా విని, "నాకు ఒక్క చిన్న సందేహం ఉంది! మీరు శరీరశాస్త్రాన్ని

గంగన్నకు ఎదురువచ్చి, "వైద్యాచార్యా! నేను చాలాకష్టంలో వున్నాను. మీకోసమే ఎదురు చూస్తున్నాను. రండి, రండి!" అంటూ భవనంలోకి ఆహ్వానించాడు.

గంగన్నను రోగి ఉన్న గదిలోకి తీసుకు పోయారు. "అమ్మా, మీ వంట్లో ఎలా ఉంది?" అని అడిగాడు గంగన్న జమీం దారు కూతురిని. ఆ అమ్మాయి వినపడీ వినపడనట్టు ఏదో గొణిగింది.

"అమ్మాయి మాట్లాడే భాష ఏదోగాని నాకు ఒక్కముక్కకూడా అర్థంకాలేదు," అన్నాడు గంగన్న విస్తుపోయి. అందుకు జమీందారు వినయంగా:

గురించి చాలా విషయాలు చెప్పారు, బాగానే వుంది. కాని, మనిషికి గుండెకాయ కుడివైపున ఉంటుందంటారేం? ఎడమ వైపున గదా?" అన్నాడు అనుమానంగా.

అందుకు గంగన్న తడుముకోకుండా:
"ఔను, పూర్వకాలంలో అలాగే వుండేది! కాని యిప్పటిదంతా పిదపకాలంగదా? అంతా తారుమారు!" అనేశాడు.

"తెలియక అడిగాను క్షమించండి! నేనేదో పాతకాలపు మనిషిని. యీ మధ్య వస్తున్న మార్పులు అంతగా నాకు తెలీవు," అన్నాడు జమీందారు.



తరవాత గంగన్న జమీందారు కూతురు చేతి నాడి పరీక్షించి—

"రోగం ప్రారంభదశలోనే ఉంది. అన్నం ముద్దలుగా చేయించి మజ్జిగలో ముంచి తినిపించండి. తక్కున గుణం యిస్తుంది. రామచిలుకలు తినే ఆహారం అదేగదా? అవి ఎంత చక్కగా మాట్లాడుతై!" అన్నాడు ఆశ్చర్యంగా.

జమీందారుకు గంగన్నమీద గురి కుదిరింది. వద్దన్నా బలవంతాన అతనికి చాలా ధనం ఇచ్చాడు. వీలు వెంట మరోసారి వచ్చి రోగిని పరీక్షించవలిసిందని కోరాడు. జమీందారుచేసిన గౌరవానికి గంగన్న చాలా సంతోషించాడు. అనుకోకుండా అంత ధనం లభించినందుకు ఆనందిస్తూ అతడు యింటికి వచ్చేసరికి, వాకిటిముందు నిలబడి వున్న ఒక యువకుడు కనిపించాడు.

గంగన్న, ఆ యువకుణ్ణి, "ఎవరు నువు?" అంటూ గదమాయించి అడిగాడు. అందుకు ఆ యువకుడు:

"అయ్యా! మీరు గొప్ప వైద్యులని తెలిసి వచ్చాను. జమీందారుగారి కూతురుకు మాట పడిపోవటం అంతా వట్టిది. వాళ్ళ తండ్రి నిశ్చయించిన వరుణ్ణి చేసుకోవటం ఇష్టంలేక అలా మాట పడిపోయినట్టు నటిస్తోంది. ఆ అమ్మాయీ నేనూ

వివాహం చేసుకునేందుకు లోగడే ఒప్పందం చేసుకున్నాం!!" అన్నాడు.

యువకుడు చెప్పిందంతా విని గంగన్న చాలా ఆశ్చర్యపడ్డాడు. నాలుగురోజుల తర వాత ఆ యువకుణ్ణి వెంటబెట్టుకుని జమీం దారు కోటకు వెళ్ళాడు. జమీందారు ఎదురువచ్చి ఆ యిద్దరినీ కూతురు ఉన్న గదికి తీసుకు పోయాడు.

గంగన్నతో వచ్చిన యువకుణ్ణి చూడ గానే, జమీందారు కూతురు మంచంమీద లేచి కూచున్నది. గొంతెత్తి యిష్టం వచ్చి నట్టల్లా మాట్లాడసాగింది. తండ్రి నిశ్చ యించిన వివాహం చేసుకోననీ, అంతగా బలవంతపెడితే బావిలో దూకి చస్తాననీ బెదిరించింది.

కూతురు అలా మాట్లాడేసరికి జమీం దారుకు ఎక్కడలేని కోపం వచ్చింది.

"అయ్యా, వైద్యుడు గారూ!—మళ్ళీ మా అమ్మాయి మాట పడిపోయేటట్టు మందే మైనా యివ్వండి! ఆ వాగుడు వినలేక చెవులు దిబ్బళ్ళు పడుతున్నై," అన్నాడు ప్రాధేయపడుతూ. అందుకు గంగన్న నవ్వి, "మీ అమ్మాయికి మాట పడిపోయేందుకు మందివ్వటం నావల్లకాదు. అలాంటి మందులు వున్నట్టుకూడా నేను వినలేదు. కావాలంటే మీకు చెవుడు వచ్చేటట్టు చిటికలో చేస్తాను!" అన్నాడు.

గంగన్న అలాఅనే సరికి, జమీందారు తెల్లబోయాడు. ఇక చేసేదిలేక కుమార్తె ఇష్టపడిన యువకుడికే ఆమెను ఇచ్చి వివాహం చేసేందుకు సమ్మతించాడు.

గంగన్న యింటికి వచ్చాడు. భార్యతో తన వైద్యం సంగతీ, సంపాయించిన డబ్బు సంగతీ చెప్పాడు. తన ఎత్తు పారనందుకు శాయమ్మ మొదట్లో విచారించింది. కాని తరవాత భర్త తెలితేటలు మెచ్చుకో సాగింది. గంగన్నకూడా ఆ రోజునుంచి భార్యను కొట్టటం మానేశాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ధనమిచ్చి ధ్యానిస్తె దయ కలుగుతుందా!

రెండవ ఫోటో : ముండ్లపై కూర్చుంటె ముక్తి వస్తుందా!

పంపినవారు : కొప్పుల హేమాద్రి, C/o కె. అచ్చయ్యగారు,

గొల్లప్రోలు, (తూ॥ గోదావరిజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# కప్పలు

చేపలు జలచరాలు : అవి నీటిలోనే బతకగలవు. కప్పలు ఉభయచరాలు ; వాటి జీవితం మొదట్లో అచ్చుగా నీటిలోనే గడుస్తుంది, తరవాత నేలమీదకూడా గడుస్తుంది.

ఆడకప్ప నీటిలో గుడ్లు పెడుతుంది. గుడ్లన్నిటినీ తెల్లని జిగురులాటి పదార్థం కలిపి ఉంచుతుంది. ఈ గుడ్లు క్రమంగా పెరిగి చిక్కుడు గింజల ఆకారం పొందుతాయి. ఒక చివర రెండో చివరకన్న లావుగా ఉంటుంది. లావువైపు తలా, సన్నని వైపు తోకా ఉంటాయి.

వారం రోజులలో గుడ్లు పొదిగి కప్పపిల్లలు బయటికి వస్తాయి. ఈ దశలో కప్పపిల్లకి కళ్ళుండవు; నోటికి బదులు చిన్న తొండంలాటిది ఉంటుంది, దీనితో అది దేన్నయినా పట్టుకో గలదు. ఈ దశలో దానికి, చేపకులాగే, మొప్పలుంటాయి ; వాటితోనే అది శ్వాసపీలుస్తుంది. ఈ దశలో అది పూర్తిగా జలచరం.

రెండు మూడు రోజులలోగా కప్పపిల్లలకు కళ్ళూ, నోరూ ఏర్పడతాయి. తొండమూ, మొప్పలూ పోతాయి. దాని శరీరంలో ఎడమ వైపున ఒక "శ్వాసరంధ్రం" ఉంటుంది. అది నోటితో నీరు పీల్చి ఈ శ్వాసరంధ్రంగుండా బయటికి వదులుతుంది.

ఈ దశలో ఇది శాకాహారి, నీటి అడుగున ఉండే నాచు వగైరా మొక్కలు తింటుంది. ఈ తిండి సహాయంతో దాని శరీరం పెరుగుతుంది. తోక ఆరంభమయే చోట రెండు కాళ్ళు మొలుస్తాయి. ఇవి పూర్తిగా పెరిగినాక శ్వాసరంధ్రంలోనుంచి ముందు కాలు ఒకటీ, దాని వెనకగా ఇంకొక ముందుకాలూ పెరుగుతాయి. నాలుగు కాళ్ళు ఏర్పడ్డాకకూడా దానికింకా తోక ఉంటుంది.

ఈ దశలో కప్పపిల్ల శరీరంలోకూడా మార్పులు వస్తాయి : గాలి పీల్చటానికి ఉప యోగపడే ఊపిరితిత్తులు ఏర్పడతాయి ; దాని నోరు పెద్దదవుతుంది. ఈ దశలో కప్పపిల్ల నోటితో ఆహారం తినలేదు. అందుచేత దాని తోకనే అది జీర్ణం చేసుకో సాగుతుంది. ఆ తోక



క్రమంగా తరిగి పోతుంది. దాని నోట్లో నాలుక ఏర్పడుతుంది. ఇది దాని నోటి ముందు భాగానికి అంటుకుని ఉంటుంది.

తోక సాంతం ఊడిపోక ముందే కప్పపిల్ల నీటినుంచి బయటికి వచ్చి అరవటమూ, పురుగులను పట్టుకుతినటమూ మొదలైన పనులు చేస్తుంది. ఇప్పుడిది పూర్తిగా మాంసాహారి.

కప్పలవంటి ఉభయచరాలు నేలమీదకూడా జీవించగలిగినప్పటికీ, అవి తడిలేని చోట్లనూ, నీటికి చాలా దూరంగానూ జీవించలేవు. ఎందుచేతనంటే వాటి చర్మాలను రక్షించటానికి పొలుసులుగాని, రోమాలుగాని, ఈకలుగాని ఉండవు. అందుచేత అవి నీటికి సమీపంలోనే జీవిస్తాయి. ఆ నీరైనా మంచినీరుగా ఉండాలిగాని ఉప్పు నీరు పనికిరాదు. సముద్ర జలంలో ఉభయచరా లుండవు !

మనం చూసే కప్పలలో రెండు జాతులున్నాయి—కప్పలూ, గోదురు కప్పలూ. కప్పల చర్మం నున్నగా, తడిగా, మెత్తగా ఉంటుంది. గోదురుకప్పల చర్మం మొరటుగా, ఎండిపోయి, బుడిపెలుతేరి ఉంటుంది. కప్పలు సన్నగా, నాజూకుగా ఉంటాయి. గోదురుకప్పలు లావుగా వికారంగా ఉంటాయి ; వాటి ముందుకాళ్ళు కురచ. కప్పలకు చిన్నచిన్న దంతాలుంటాయి, గోదురుకప్పలకు దంతాలుండవు.

కప్పలు కదలని ఆహారాన్ని పట్టుకుని తినవు—చచ్చిన కీటకాలను తినవు. వాటి నాలుకలు చాలా నిడుపుగా, జిగురుగా వుంటాయి. కప్ప తన ఆహారాన్ని దిగమింగేటప్పుడు కళ్ళను మూసుకుంటుంది.

కప్పలలో మగవి మాత్రమే అరుస్తాయి. వాటికి గాలి తిత్తులుంటాయి. అందులోకి గాలి పోనిచ్చి ఆ గాలిని బయటికి తోసినప్పుడు అరుపు వస్తుంది.

కప్పలకు ఆహారంగా పనికివచ్చే కీటకాలు మనకు ఒక్కొక్కప్పుడు అపకారం చేసేవిగా ఉంటాయి. అందుచేత కప్పలవల్ల మనకు మేలున్నది. అందుచేత మనం వాటిని రక్షించాలి.





# ఇంద్రజాలము

ప్రొఫెసర్ పి. సి. సర్కార్

ప్రేక్షకుల్లో ఒకర్ని రంగస్థలిమీదికి ఆహ్వానించి కుర్చీవేసి కూచోపెట్టాలి. అతడితో కాసేపు అమాటా ఈమాటా మాట్లాడి, అతడు ధరించిన నెక్‌టై మీదికి దృష్టిని పోనివ్వాలి. తరవాత సమయోచితంగా 'ఇప్పుడు మన భారత దేశంలో నెక్‌టై ధరించే ఆచారం లేదు' అని అంటూ పదునైన కత్తెరతో దాన్ని ప్రక్కచిత్రంలో చూపినట్లు కత్తిరించెయ్యాలి. ఇంద్రజాలికుడు దాన్ని ముక్కలుముక్కలుగా కత్తిరించటంతో ఊరుకోక, టేబిల్ మీదవున్న మైనపువత్తి దీపంతో వాటిని కాల్చి పారెయ్యాలి. తర్వాత ఓ సహచరుడు దగ్గిరకి వచ్చి, 'ఈయన భారతీయుడు కాడు. దొరబిడ్డ. వారికి నెక్‌టై ధరించే ఆచారం ఉంది,' అని చెపుతాడు. అ మాట విని ఇంద్రజాలికుడు ముందు కొంచెం తెల్లబోయినట్లు నటించి, మరుక్షణంలోనే తన మంత్ర దండంతో నెక్‌టై యథాప్రకారంగా ఉన్నట్లు చేస్తాడు!

ఇహ నిప్పుడు ఇందులో ఉన్న కిటుకు చెపుతున్నా: ఆ రంగస్థలి మీదికి ఆహ్వానింపబడే వ్యక్తి తనకు అంతరంగికుడే అయి ఉండాలి. అతడు ముందుగానే ప్రత్యేకంగా తయారు చేయబడిన నెక్‌టైని ధరించి ఉండాలి. ఒకే రకపు నెక్‌టైలు రెండు కొనుక్కువచ్చి మొదటిదాన్ని '1' లాగా అమర్చుకోవాలి. ముడి దగ్గిర్నుంచి మిగిలిన భాగమంతా ఆ వ్యక్తి షర్టులోపలికి

పోనిచ్చి, పైకి కన్పించకుండా చెయ్యాలి. రెండో నెక్టైలో ముందరి 'ఫ్లాప్' ను '2' భాగాన్ని కత్తిరించి, '1' నెక్టై ముడికింద ప్రక్క చిత్రంలో చూపినట్లు దోపి ఉంచితే- అసలు నెక్టై అనే భ్రమ కలుగుతుంది. ఇంద్రజాలికుడు ఈ భాగాన్నే కత్తిరించి ముక్కలు చేసి, కాల్చి పారేసేది. తర్వాత మంత్రదండంతో షర్టులోపల ఉన్న నెక్టైని పైకి లాగేసెయ్యాలి- అంతే. అయిపోయినట్లే. ఇది కొంచెం కష్టమైన మ్యాజిక్.

అమెరికాలోని ఇంద్రజాలికులు చాలామంది దీన్నిప్పుడు చాలా నిర్దుష్టంగా చూపుతున్నారు. కొంచెం ముందుజాగ్రతలు తీసుకుని చాకచక్యంగా చేయగలవారికి యిదేమంత కష్టమయిందికాదు. ఇంద్రజాలికుడు కొంచెం హాస్యధోరణిలో మాట్లాడుతూ ప్రేక్షకుల దృష్టిని ఆకర్షించాలి. ఆ విధంగా చేయగలిగితే, దీన్ని అద్వితీయమైన కిటుకు అని చెప్పొచ్చు.



[పాఠకులు, యీ గారడీని గురించి ఏమరేవైనా సలహాలు పొందదలిస్తే: ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, బాలీగంజ్, కలకత్తా - 19.]



# వార్తలు-విశేషాలు

మనదేశంలో తరుచుగా కనిపించే చిరుతపులులు వేటకు బలి అయిపోయినవనీ, ఒకే ఒక చిరుత మిగిలిందనీ లోకసభలో వెల్లడించబడింది. చిరుతజాతిని రక్షించే విషయంలో తగు చర్యలు తీసుకోమని భారత ప్రభుత్వం, 'వన్యమృగ సంరక్షణ సంఘా'న్ని కోరింది.

*     *     *     *

ఆంధ్రప్రదేశ్‌లో, ఒకటిన్నర కోట్ల రూపాయల పెట్టుబడితో పరిశ్రమల అభివృద్ధికిగాను ఆర్థిక సహాయక సంస్థ ఏర్పడింది. దీని ప్రధాన కార్యాలయం హైదరాబాదులో వుంటుంది.

*     *     *     *

'భారత్ దర్శన్' అనే చిత్రం—ఫిల్మ్ డివిజన్‌వారు తయారుచేసినదానికి, చెకోస్లోవాకియాలో జరిగిన అంతర్జాతీయ ప్రదర్శనంలో బహుమానం వచ్చింది.

*     *     *     *

న్యూఢిల్లీలో ఇటీవల జరిగిన బుద్ధజయంతి పంచవింశ శత వార్షికోత్సవంలో పాల్గొనటానికి టిబెట్టునుండి దలై లామా, పంచన్‌లామా, సిక్కిం మహారాజా వచ్చారు. 'విజ్ఞాన్ భవన్'లో జరిగిన బౌద్ధ విద్వద్గోష్ఠిలో వారు పాల్గొన్నారు.

*     *     *     *

ఇటీవల నాగార్జునకొండ ప్రాంతంలో ఒక అమూల్యమైన సంస్కృతశాసనం దొరికింది. ఇది బ్రాహ్మీ లిపిలో వుంది. దీన్నిబట్టి, క్రీస్తుశకం 2-వ శతాబ్దినాటికే సంస్కృతం వ్యవహారంలో వుండినదనే సిద్ధాంతానికి అవకాశం కల్గుతున్నది.



**12** రోజుల పర్యటనకుగాను మనదేశానికి చీనా ప్రధాని చౌ-ఎన్-లై వచ్చారు. ఢిల్లీ విమాన కేంద్రంలో ఆయనకు ఘనమైన స్వాగతం ఇవ్వబడింది.

* * * *

డిసెంబరు 6-వ తేదీన డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ మరణించారు. ఈయన, వెనుకబడిన జాతులకు అపారసేవ చేసిన మేధావి. స్వతంత్ర భారతదేశంలో మొట్టమొదటి న్యాయశాఖా మంత్రిగా ఉండి, నూతన రాజ్యాంగ రచనకు చాలా దోహదం చేశారు.

* * * *

యూనియన్ లైట్‌హౌస్ శాఖవారు వంద దీపస్తంభాలను నిర్మించబోతున్నారు. అందులో ఒకటి ఇప్పుడు పూరీలో నిర్మించబడుతున్నది. 21,600 కొవ్వొత్తుల కాంతి గల ఈ దీప స్తంభం తాలూకు కాంతి 14 మైళ్ళవరకు కనిపిస్తుంది.

* * * *

ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో, గ్రామసూనె పరిశ్రమలను అభివృద్ధి చేయటానికి, కేంద్ర ప్రభుత్వం ఒక పథకాన్ని ఆమోదించింది. ఈ పథకంకింద దేశంలోని వివిధ ప్రాంతాలలోను 75 నమూనా ప్రదర్శక—ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పుతారు.

* * * *

పారిశ్రామిక గృహనిర్మాణ సహాయ పథకంకింద, 1956 అక్టోబరులో ఇండియా ప్రభుత్వం 26,14,429 రూపాయలు ఋణాల రూపంలో మంజూరు చేసింది.

* * * *

ఈమధ్య ఆస్ట్రేలియాలోని మెల్బోర్న్‌నగరంలో ఒలింపిక్ ఆటలు జరిగినవి. ప్రపంచంలో అన్ని దేశాలవారూ ఈ ఆటలలో పాల్గొన్నారు. ఇందులో హాకీ ఆటకుగాను ఇండియా ఒక బంగారు పతకాన్ని గెల్చుకున్నది. ఈ క్రీడోత్సవాలు 1960 లో రోమ్‌లో జరగబోతాయి.

* * * *

పట్టుపరిశ్రమాభివృద్ధి కోసం భారతప్రభుత్వం కొన్ని పథకాలను ఆమోదించింది. పశ్చిమ బెంగాల్, బీహార్, అస్సాం, ఒరిస్సా రాష్ట్రాల్లో ఇవి ప్రారంభమవుతాయి.



# చిత్రకథ





ఒక రోజు సాయంకాలం దాసూ, వాసూలు పార్కుకేసి బయలుదేరారు. దారిలో ఒక దొంగ కుర్రవాడు, వాసు జేబులో వున్న బేడకాసును కాజేశాడు. ఆ సంగతి వాసు గుర్తించనే లేదు. కాని 'టైగర్' ఆ దొంగ కుర్రవాడి వెంట బయలుదేరింది. ఆ కుర్రవాడు ఒక మిఠాయి దుకాణంలో మిఠాయి కొని, డబ్బులు యివ్వబోయేంతలో, 'టైగర్' ఆ పొట్లాన్ని నోట కరుచుకుని, దాసూ వాసూలు కూచున్న చోటుకు పరిగెత్తింది. దొంగ కుర్రవాడు 'టైగర్' వెంట కొంత దూరం పరిగెత్తి, అది ఎక్కడికి వెళ్ళుతున్నదో చూచి, పారిపోయాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'



# ఎంతోమంది చక్కని క్రొత్త
# పెళ్లికూతుళ్లవలె




ఆమె కూడా
మోహక
పరిమళముగల

# జై

టాయిలెట్ సబ్బును
ఎన్నుకొనును

తాతా తయారు

నూటికి నూరు పాళ్లు భారతీయ
- పెట్టుబడి
- నిర్వహణ
- పనివాళ్ల పాటు

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముండ్లపై కూర్చుంటె ముక్తి వస్తుందా !

పంపినవారు :
కె. హేమాద్రి - గొల్లప్రోలు

